# అపరాధ పరిశోధన

రు. 3 | ఆగస్టు '75



అపరాధ పరిశోధన అనుబంధం - 20

# నాలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## చైనా దురాక్రమణ !!

ర : ముద్దా సురేష్

4

## బద్ధ విరోధులు ?

రచన : 'రాజా'

## దెయ్యంపట్టిన మనిషి

రచన : కంచర్ల రమణ

## భూగర్భంలో బందీ !

రచన: సంపత్

"ఖైదీ" సీరియల్ -15వ భాగము

# అపరాధ పరిశోధన సప్లిమెంట్-20

ఆగస్టు, 1975

వెల : రు. 3-00

ఏడాది చందా 39 రూపాయలు

ఉచిత చందా డిపాజిట్టు 250 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్ :

శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం :

టెంపోరావ్

శ్యాంబాబు

రమణశ్రీ

ఏ. వీ. మోహన్రావ్

సుజనశ్రీ

వసుంధర

కంచర రమణ

కార్యాలయం :

అపరాధ పరిశోధన కార్యాలయం

నారాయణగూడ, హైద్రాబాద్-29

ఫోన్ – 36959

ముద్రణ :

ప్రగతి ఆర్ట్ ప్రింటర్స్

లకిడికాపూల్, హైద్రాబాద్ - 500 004.

# చైనా దురాక్రమణ

ముద్దా సురేష్

అది నేఫాలోని కీలకమైన వాలాంగ్ స్థావరం.

అంతా కటిక చీకటి. కీచురాళ్ళ రొద భయంకరంగా విన బడుతోంది. కీకారణ్యం అది. రాక్షసుల్లా పెరిగిన ఎత్తయిన చెట్లు గాలి కవ్వించినప్పుడల్లా పగలబడి నవ్వుతున్నాయి.

తమ స్థావరం కాపాడుకోవడంకోసం బంకర్లలో పొంచి ఉన్న భారత సైనికులు ఎముకలు కొరికే చలిఅంటే ఏమిటో తెలుసుకుంటున్నారు. 32 డిగ్రీలు తక్కువగా ఉంది అక్కడి శీతలం. వారి దవడలు టక టక వణుకుతున్నయ్ అసంకల్ప ప్రతీకార చర్యగా.

బారక్స్‌లోని ఏరియా కమాండర్ భారత్ కపాడియా

విపరీతంగా ఆలోచిస్తున్నాడు. అతని కనుబొమ్మలు ముడి వడి నూటఇరవై నిముషాలయింది. అతనిలోని యువక రక్తం ఉడికిపోతూంది. శత్రువులపై ప్రతీకారం తీర్చుకోవాలి. దురాక్రమణ జయించదని నిరూపించాలి. దేశరక్షణకై తన శిక్షణ, తన మేధాశక్తి శరీరంలో చివరి రక్తపుబొట్టు ఉండే వరకూ ఉపయోగపడాలి; ఇవీ అతని ఆశయాలు.

ఆ రోజు ఉదయం భారత సరిహద్దుల్లోకి చైనా ఆకస్మికంగా దూసుకు వచ్చింది. సైన్యాన్ని గొర్రెల మందలా వదలి సిఫాలోని దోమ్‌లా ప్రాంతాన్ని ఆక్రమించుకొంది. ప్రజానీకాన్ని నిశ్చేష్టులను గావిస్తూ, ఢిల్లీ నగరం మీదుగా మూడు చైనా యుద్ధ విమానాలు చక్కర్లు కొట్టాయి. అందులో భారత యాంటీ-ఎయిర్‌క్రాఫ్టు గన్‌లకు రెండు విమానాలు బలైపోయాయి.

వంకలేనమ్మ డొంకట్టు కేడ్చినట్టు, భారత్-చైనా మీద నాట్ యుద్ధ విమానాలు పంపి కయ్యానికి కాలుదువ్వెందనీ, టిబెట్ తిరుగుబాటుదారులు భారత భూభాగంలోని రహస్య స్థావరాలలో తలదాచుకుంటున్నారని, వారి ప్రోత్సాహంతో భారత ప్రభుత్వం సరిహద్దుల్లో యుద్ధ కలాపాలు కొనసాగించిందని, రేడియో పీకింగ్ అసత్య ప్రచారం ప్రారంభించింది. నోటిలోమాట నోటిలో ఉండగానే సైన్యాన్ని విపరీతంగా కుమ్మరించింది సరిహద్దుల్లో.

అందుకే కమాండర్ కపాడియాకి ఒళ్ళు మండింది. అతని మెదడులోంచి రకరకాల యుద్ధ వ్యూహాలు చకచకా కాగితంపైకి ఎక్కుతున్నాయ్.

ఎదురుగా ఓ కొయ్య టేబుల్ ఉంది. దానిపై కొన్ని

కాగితాలు డ్రాయింగ్ పిన్‌లు గుచ్చబడి ఉన్నాయి. ఓ పక్కగా జామెట్రికల్ ఇన్‌స్ట్రుమెంట్స్ పడిఉన్నయ్. ఏదో రాస్తున్నాడు కపాడియా. అప్పుడప్పుడు చిన్న చిన్న డయాగ్రమ్స్ గీస్తున్నాడు.

మరో అరగంట అతనికి తెలియకుండా కాలగర్భంలో కల్సిపోయింది.

"య్యా" అంటూ ఎగిరి గంతేసి ఒక్కసారిగా అరిచాడు కమాండర్ కపాడియా. అది ఆనందం పట్టలేక వేసిన పొలికేక.

సెంట్రీ మున్షీరాం కంగారుగా లోపలికి వచ్చాడు. తను పన్నిన పద్మవ్యూహాల కేసి ఓసారి గర్వంగాచూసి కమాన్ మున్షీరాం! కమ్ అండ్ సీ! అంటూ అతన్ని కౌగలించుకొన్నాడు. ఆప్యాయంగా విషయంచెప్పాడు అతనికి.

ఆ క్షణంలో తన దర్పం, తన రాంక్ గుర్తుకు రాలేదు. కపాడియాకి. ఎదుటివాడు భారతీయుడు! అంతే!

'సాబ్' భారతమాత మిమ్మల్ని ఆనందబాష్పాలతో ఆశీర్వదిస్తుంది అన్నాడు సెంట్రీ, జైంట్ ఫ్లాస్కులోని టీని మగ్‌లో పోసి కపాడియాకిస్తూ.

"థాంక్స్ మున్‌షీ;" టీ చప్పరిస్తూ తల ఊపాడు కపాడియా. అప్పుడే నా పని పూర్తి అవలేదుభాయ్! ఈ కాగితాలు మిలటరీ ఇంటలిజెన్స్‌బ్యూరోకి అందేట్లుచూడాలి. అక్కడ నుండి ఆర్మీ జనరల్ సహాయంతో ఈ వ్యూహాలు మన సరిహద్దులు విస్తరించియున్న పశ్చిమ, మధ్య, తూర్పు రంగాల్లో అమలుపరచబడాలి. చైనా పిశాచాలు బోనులోని ఎలుకల్లా పిచ్చిగంతులు.........' కపాడియా మాటలు

పూర్తికాలేదు. అతను ఎందుకో తటాలున నేలమీదికిదొర్లి చెవులు మూసుకొని పడుకున్నాడు. సెంట్రీ అదే పని చేసాడు.

"బయ్" మంటూ విమాన శబ్దాలు

ధన్......ధన్......ధన్...... బాంబులు కురిసిన శబ్దాలు వరుసగా పదిహేనుసార్లు వినబడ్డాయ్ ప్రేలుళ్ళు... భూమి విడిపోతుట్లయింది. బారక్సు సగం కూలిపోయాయి.

విమానాలరొద దూరమైన శబ్దం వినబడింది "ఎయిర్ ఎటాక్" అన్నాడు ఆందోళనగా కపాడియా.

"జీ సాబ్" గొనిగాడు ఎక్కడి నుంచో మున్షీరాం. దుమ్ము దులుపుకుంటూ పైకి లేచాడు కపాడియా. మరి బయట మన యాంటీ ఎయిర్‌క్రాఫ్ట్‌గన్‌లు ఏం చేస్తున్నట్టు?

"మర్చిపోయారా సాబ్! మన రాడార్‌లు యాంటిఎయిర్ క్రాఫ్టుగన్‌లు ప్రమాద పరిస్థితిని మెసేజ్ వస్తే దూమ్‌లా తరలించాడు. తీరా ఇప్పుడు అది శత్రువుల స్వాధీనంలో ఉంది. శత్రువులు ఇంకా ఎంత ముందుకువచ్చారో తెలీదు. మనకి టాంగ్ పాంగ్లా నుంచి సప్లయిస్ రెండు రోజుల్లో రావలసి ఉంది.

"సరే వద' చిరాగ్గా అన్నాడు కపాడియా. బారక్సు నుండి బయటికి వచ్చిన కమాండర్ కపాడియా అదిరిపడ్డాడు. ఎదురుగా ఎక్కడ చూసినా మంటలు; బాంబింగ్ ప్రభావం చేత ఏర్పడిన గోతులు! వాటి మధ్య ట్రెంచెస్‌లోను, ఇసుక బస్తాలపైనా, దేహాలుతెగి, శవాలుగా మారి అస్తవ్యస్తంగా పడిఉన్న ఆరు ప్లెటూన్ల భారత సైనికులు, ఇద్దరు లెఫ్టినెంట్లు కళేబరాలు!! అందే లెఫ్టినెంట్లుకాక మొత్తం రెండు వందల

దభ్భైరెండు మంది... "ఓహ్! భగవాన్! ఎందుకిలాంటి పరిస్థితి కల్పించావ్! నాయకుడిగా దగ్గరుండి రక్షించలేక పోయాను!" పిడికలితో నుదురు బాదుకున్నాడ్ కపాడియా.

"సాబ్!" అన్న పొలికేక వినబడి వులిక్కిపడ్డాడు కపాడియా. గబగబా ఓ తాడిచెట్టు దిగుతున్నాడు సెంట్రీ. అతని మెడలో ఓ బైనాక్యులర్ వ్రేలాడుతోంది. "సాబ్! చెట్టెక్కి చూసాను! రెండు ఫర్లాంగులదూరంలో చైనా సైని కులు టార్చిలైట్లతో ఇటువైపే వస్తున్నారు. బహుశ వారికి ఈ మంటలు కనబడిఉండాలి" రొప్పుతూ అన్నాడు సెంట్రీ.

"వాళ్ళు శత్రువులే అని ఎలా చెప్పగలవ్?' అంత చలి లోను నుదుటికి పట్టిన చెమట తుడుచుకున్నాడు కపాడియా.

"ష్యూర్ సాబ్! టార్చిలైట్ల కాంతిలో చూశాను వాళ్ళ పేడి మొహాలు. పైగా శత్రువులు సుమారు 2000 మంది ఉంటారు సాబ్!"

అదిరి పడ్డాడు కపాడియా? అంటే హోర్డ్ పద్ధతిలో... గొణిగాడు.

"జీ సాబ్! 1962 లో నాకు అనుభవమే. 10 మందికి 1000 మంది నిష్పత్తిలో చైనావారు తమ సైన్యాన్ని నడుపు తారు. వట్టినే విపరీతంగా మందుగుండు సామాగ్రి వాడు తారు. ఒక లక్ష్యమంటూ ఉండదు. సుమారు 2000 మంది ఒకేసారి రావడం, ఉన్న మందుగుండు సామాగ్రి ఖాళీచెయ్య డం, వీలున్నంత మంది చనిపోవడం, మిగతావారు భారత స్థావరాన్ని పట్టుకోవడమో లేక పారిపోవడమో! ఇది వారి వ్యూహం!"

అతని మాటలు కపాడియాకి వినబడ్డంలేదు.

"మున్షీరాం!" అరిచాడు కపాడియా '•క్విక్! మనం ఇద్దరమే ఉన్నాం! శత్రువులు వచ్చేలోగా నువ్వో పని పూర్తి చెయ్యాలి! మన చీపురుపుల్ల కూడా శత్రువుల కందకూడదు. తుపాకులను, ఇతర సామగ్రిని ప్రోగుచేసి పక్కనున్న లోయలోకి విసిరేయ్! నేను సిగ్నలింగ్ బారక్స్‌లోకి వెళ్ళి మన ఇతర స్థావరాలను కాంటాక్టు చెయ్యడానికి ప్రయత్నిస్తాను! అండర్‌స్టాండ్'' గబగబా అన్నాడు ఏరియా కమాండర్ భరత్ కపాడియా.

'జీ సాబ్!' టకాలున శాల్యూట్ కొట్టి వెనుదిరిగాడు మున్షీరాం. సగం కూలి పోయిన సిగ్నలింగ్ బారక్స్‌లోకి నడిచాడు కపాడియా. అతని కాళ్ళు టక్కున ఆగిపోయాయి. ఎదురుగా ట్రాన్స్‌మిషన్ యంత్రాలు పగిలిపోయి ఉన్నాయి. తెగిపోయిన వైర్లు వెక్కిరిస్తున్నట్లున్నాయ్

సిగ్నలర్ మృతదేహం టేబుల్ మీద వాలిపోయి ఉంది. అతని ముఖం ఉండాల్సిన స్థానంలో ఎర్రగా రక్తం గడ్డకట్టి ఛిద్రమైన మాంసపు ముద్ద ఉంది.

# 2

కమాండర్ కపాడియా తల పంకించి తన బారక్స్‌వైపు కదలాడు. 'శత్రువుల మధ్య ఎక్కువకాలం వేస్ట్ చెయ్యకూడదు. తను డిజైన్ చేసిన వ్యూహాలు వీలయినంత త్వరలో ప్రభుత్వపరం చెయ్యాలి' అనుకున్నాడు కపాడియా.

గబగబా లోపలికివెళ్ళి తనకు కావల్సిన సామగ్రి కిట్‌లోకి తోసి, దాన్ని వీపువెనుకగా బెల్టుకున్న బకుల్స్‌కి బిగించాడు. ఆఫీసర్‌గా, శత్రువుల చేతిలో ఇరుక్కుంటే ప్రమాదం. అందుకని తన ఆకుపచ్చని యూనిఫాంకి ఉన్న

బాడ్జెస్ తీసివేశాడు. ఆఫీసర్ హాట్ తొలగించి మామూలు సైనికుడి హెల్మెట్ ధరించాడు. చలిని తట్టుకోడానికి ఓవరాక్ వేసుకొన్నాడు. కొత్త ఉత్సాహం తెచ్చుకొన్నాడు.

అంతలో మున్షీరాం పరిగెత్తుకుంటూ వచ్చి శాల్యూట్ చేశాడు. "పని పూర్తయిందిసార్?' అన్నాడు.

"నో ఇంకా పూర్తికాలేదు. రెండువేలమంది శత్రువులని ఊరికే ఆహ్వానించి మనం పారిపోవడం భారత సైనికుడు చెయ్యాల్సిన పనికాదు" అంటూ సెంట్రీ చెవిలో ఏదో చెప్పాడు. సెంట్రీ కళ్ళు మెరిసాయి. "యు. ఆర్. జీనియస్ సాబ్" అన్నాడు.

"బాత్ చీత్ నై, డ్యూటీ ఫస్ట్" అంటూ కపాడియా ఓవరాక్‌లోంచి గుండ్రంగా కంపెనీబట్టల ఆకారంలో ఉన్న అరడజను బాంబుల బండిల్స్ తీసి అతనివైపు విసిరాడు

ఆ బండిల్స్ ఒకదానికొకటి పొడవాటి సల్ఫర్ వైర్‌తో కనెక్టు చేయబడిఉన్నాయ్.

మున్షీరాం ఆ బాంబులను స్థావరంచుట్టూఉన్న చెట్లని కలుపుతూ బిగించాడు. ఇంకా మిగిలిఉన్న వైర్ (వత్తిని) స్థావరానికి దూరంగా తీసుకుపోయాడు. కపాడియా, మున్షీ రాం పనిని పర్యవేక్షించసాగాడు. బూటు "టో" మీద నిల బడి మెడలో వ్రేలాడుతున్న పవర్‌ఫుల్ షార్ట్‌ఫోకస్ బైనాక్యులర్స్ గుండా ముందుకు చూసాడు కపాడియా.

శత్రువులు 50 గజాల దూరంలో ఉన్నారు. మార్చింగ్ చేస్తూ స్థావరాన్ని చేరుకోడాన్కి మూడు నిమిషాలు పట్ట వచ్చు. రేడియం వాచిలో మరో నిమిషం గడిచిన తర్వాత "కమాన్! విత్ ది వైర్!" అంటూ సగంగొంతుతో అరి

చాడు కపాడియా.

మున్షీరాం అప్పటికే ఆలస్యం అన్నట్లు, చేతిలోని సిగరెట్ ని సల్ఫర్ వైర్ చివర ముట్టించాడు.

సర్...సర్... మంటూ వెలిగింది గంధకం. 'కమాన్! మున్షీ! దబులప్! ఈ ప్రాంతాలు వదిలెయ్యాలి మనం!" ఇద్దరూ చీకట్లోకి ఏటో పరిగెత్తారు. వారి బలమైన బూటు కాళ్ళమీద ఏవో నలిగిపోతున్న శబం!

రెండు నిముషాల తర్వాత అప్రయత్నంగా వెనుతిరిగారిద్దరు. దూరంగా ఎత్తయిన ప్రదేశంపై నిశీధ నిశ్శబ్దాన్ని చీల్చివేస్తూ ధన్...ధన్... మన్న విస్ఫోటాలు, ఆకాశానికి తాకే మంటలు, బాంబింగ్ స్ట్రైక్ కి కరకరా కూలిపోయిన చెట్లు, గాలిలో కెగిరిన చైనా కళేబరాలు, కపాడియా చేతిలోని షార్ట్ ఫోకస్ బైనాక్యులర్స్ క్లోజప్ లో చూపించాయి. తృప్తిగా నిట్టూర్చి ముందుకి నడిచాడు కపాడియా. మున్షీరాం అతన్ని అనుసరించసాగాడు.

# 3

తెలతెలవారుతోంది. కిచకిచాశబ్దం చేసుకొంటూ పక్షులు ఆకాశానికి అడ్డంపడ్డాయి గుంపులుగా.

"మున్షీరాం! మనం దారితప్పాం. పరుగుపెట్టడంలో జేబులోని కంపాస్ ఎక్కడో పడిపోయిఉండాలి. టాంగ్ పాంగ్లా ఎప్పటికి చేరుకొంటామో నన్న భయం వేస్తోంది."

"సాబ్! ఇలా తుప్పర్లో ప్రయాణం చేసుకుంటూ పోతే ఎక్కడో తేలతాం. అప్పుడు మనవద్ద మాప్ లో ఆ ప్రదేశాన్ని లొకేట్ చేసి మంచి దారిలో పోవచ్చు.

తల వంకించాడు కపాడియా "అబ్బా! చాలదూరం నడిచాం. ఇక్కడ కాస్సేపు విశ్రాంతి తీసుకొందాం!" అంటూ

కపాడియా చేతిలోని ఎల్. ఎం. జి. ని (లైట్ మెషీన్ గన్) నేలమీద పెట్టి ఓ పొదకు జార్లబడి కూర్చున్నాడు.

"రాత్రంతా మీ మెదడు అలసిపోయింది. తెల్లవార్లూ మీ శరీరం సొలసిపోయింది. అన్నాడు నవ్వుతూ మున్షీరాం.

మరో రెండు నిముషాలకు గాఢంగా నిద్రపట్టేసింది. కపాడియాకి. అరగంట తర్వాత తుపాకీ పేలిన చప్పుడువిని ఉలికిపడి లేచాడు కపాడియా. ఎదురుగా బోర్లా పడిఉన్న ఓ శవం ఉంది. వెన్నులోని రంధ్రంలోంచి ఎర్రని రక్తం ఓవర్ ఫ్లో అవుతోంది. "కొంపదీసి మున్షీరాం...?" ఆ ఆలో చనరాగానే అదిరిపడ్డాడు కపాడియా. శవాన్ని వెల్లకితలా తీసాడు. అతని హృదయం శాంతించింది. అది ఓ చైనీయుడి శవం.

"గుడ్ మార్నింగ్ కమాండర్ సాబ్!" అన్న మాటలు వినబడ్డాయ్. తల పైకెత్తాడు కపాడియా చేతిలో. 22 రైఫిల్ ఊపుకుంటూ ఓ గుట్టదిగి వస్తున్నాడు మున్షీరాం, నవ్వుతూ. ఉషఃకాలపు నీరెండలో అతని రైఫిల్‌కున్న బాయ్‌నెట్ తళ తళ మెరుస్తోంది.

"సాబ్! ఇద్దరూ నిద్దరపోతే బావుండదని దూరంగా చెట్లమధ్య కూర్చొని మిమ్మల్ని గమనించసాగాను. అంతలో ఈ చైనా కుక్క వచ్చాడు. మీకిట్ వాసనచూసి మిమ్మల్ని చంపబోయాడు. అంతలో నా రైఫిల్ ధన్ మంది"

కపాడియా కళ్ళు కృతజ్ఞతతో చెమ్మగిల్లాయి. "మున్షీ రాం! నీకు ఎలా కృతజ్ఞతలు చెప్పుకోవాలో తెలియడం లేదు. నీకు ఏమాత్రం కునుకు పట్టినా నా ప్రాణాలు ఈ పాటికి అనంత వాయువుల్లో కల్సిపోయేవి."

''సాబ్! నేను సేవకుణ్ణి. మీరు చిన్న వయసులోనే పెద్ద హోదా సంపాదించుకొన్న దీక్షాపరులు, మేధావులు. మీలాంటి వారు భారతమాత బిడ్డలుగా పుట్టినందుకు మేం గర్వించాలి. మీపట్ల నా డ్యూటీ నెరవేర్చి నందుకు నాకు ఎంతో తృప్తిగా ఉంది."

"మున్షీ! నువ్వు కాస్సేపు పడుకో. నేను వాచ్ చేస్తుంటాను." చిన్నగా నవ్వాడు మున్షీరాం. ''నేను సెంట్రీగాణ్ణి. నిద్ర లేకపోడం నా కలవాటే సాబ్!"

"నీతో మాట్లాడ్డం కష్టమే!" అన్నాడు కపాడియా. అతడు అందించిన చేతిలో చెయ్యివేసి పైకిలేస్తూ. తర్వాత చైనా సైనికుడిని ఓసారి పరీక్షచేసి శవాన్ని పొదలోకి లాగేసాడు కపాడియా.

"సాబ్: మీరిక్కడే ఉంటారా? నేను కొంచెం అలావెళ్ళి వేటాడి ఏదైనా ఆహారం తెస్తాను:" అన్నాడు మున్షీరాం, కపాడియా అనుమతికోసం ఎదురుచుస్తూ.

"ఎందుకు? నాకిట్‌లో రేషన్స్ ఉన్నయ్‌గా?"

''వాటిని ఇప్పుడే ఖర్చు చెయ్యడం ఎందుకు సాబ్! రాత్రివేళ ఉపయోగ పడ్తాయివి."

''నీ యిష్టం"

మున్షీరాం ఆనందంగా వెనుదిరిగాడు. కపాడియా ఎల్. ఎం. జీ ని అయిదు భాగాలుగా విడదీశాడు. దానిని ఓ చివర చిన్న గుడ్డముక్క రిబ్బన్‌ముడిలా వేసిఉంది. మరో చివర సిగరట్‌పై కాగితంలా ఓ రేకు చుట్టబడిఉంది. దాన్నే 'పుల్‌త్రూ' అంటారు. బారల్ గ్రూప్ చేతిలోకి తీసుకొని అందులో హైలీడెన్సిటివ్ అయిల్ పోశాడు. తర్వాత దాన్ని పాదాల మధ్య పెట్టుకొని పుల్‌త్రూతో క్లీన్ చెయ్యడంలో

నిమగ్నమయ్యాడు కమాండర్ కపాడియా.

ఎక్కడో రెండుసార్లు రైఫిల్‌షాట్స్ వినబడ్డాయి. పది నిమిషాల తర్వాత రెండు చేతుల్లో రెండు కొంగలతో పరిగెత్తుకుంటూ వచ్చాడు మున్షీరాం. రైఫిల్ వీపుకి వ్రేలాడు తోంది.

"చాల కష్టపడ్డావ్ మున్షీరాం!" అన్నాడు కపాడియా చేతిలో మెరుస్తున్న LMG కేసి తృప్తిగా చుస్తూ.

"మీ మాటలు శుద్ధ అబద్ధం సాబ్! ఓ విచిత్రం జరి గింది" అంటూ ఆగాడు మున్షీరాం.

అతనికేసి వింతగా చుసాడు కపాడియా.

"హాఁ సాబ్! ఆకాశంలో రెండు అడవి కొంగలు ఎగర డం నాకంట బడింది. వాటిని షూట్ చేద్దామని రైఫిల్ ఎత్త గానే ఎక్కడో రెండుసార్లు తుపాకి పేలిన శబ్దం వినబడింది. కొంగలు గిలగిలా కొట్టుకొని నా కళ్ళముందు పడ్డాయి. బైనక్యులర్స్ ఉపయోగించాను. తాము కొట్టిన కొంగలు వెతుక్కుంటూ నలుగురు చైనీస్ సైనికులు ఇటువైపే రావ డం కనపడింది. ఇప్పుడు మనం ఏదో ఒకటి చెయ్యాలి నేను కష్టపడకుండానే ఫలితం దక్కినందుకు హుషారుగా ఎత్తుకొచ్చేసాను కొంగల్ని" అన్నాడు మున్షీరాం నవ్వుతు.

"పాపం కదూ! ఒకరి నోటిలోని ఆహారం మనం లాక్కోవడం?" పెద్దగా నవ్వాడు మున్షీరాం. "అసలు వేటాడ్డమే మహాపాపం!"

"మున్‌షీ! వాళ్ళు ఏక్షణంలోనైనా ఇటు రావచ్చు. నాదో చిన్న ప్లానుంది" అన్నాడు కపాడియా.

"అలస్యం చేస్తే అమృతం ఆర్సెనిక్ అవుతుంది. షూటిట్ సాబ్!"

కపాడియా అతని చెవిలో ఏదో చెప్పి కిట్ అక్కడ వదిలేసి చెట్లలో కలిసిపోయాడు, బరువైన ఎల్. ఎం. జీ. ని మోసుకుంటూ.

# 4

మున్షీరాం తాపీగా కూర్చొని చితుకులు పేర్చి మంట తయారు చేసాడు. పొగ బాగా వచ్చేటట్లు ప్రయత్నం చేస్తున్నాడెందుకో. మంటకటూ, ఇటూ రెండేసి కర్రలు × మార్కులో పాతి, దాని మధ్య అడ్డుపుల్ల ఉంచాడు. దానిపై రెండు కొంగలని పరిచి అడ్డుపులని గుండ్రంగా తిప్పుతూ రోస్ట్ చెయ్యసాగాడు. కొంగ ఎర్రగా కాలి మాంసం కమ్మని వాసన వేయసాగింది.

అంతలో ''హండ్సప్! అన్న కంఠ స్వరం వినబడింది. గజగజా వణికిపోయాడు మున్షీరాం. ఎదురుగా నలుగురు చైనీస్ సైనికులు యమభటుల్లా నిలబడి ఉన్నారు. వారి చేతిలోని కాలసర్పల్లా ఏ క్షణానైనా కాటువెయ్యడానిక్కిసిద్ధంగా ఉన్నాయి.

''య్యూ బ్లడీ ఇండియన్!' మేము వేటాడిన కొంగల్ని ముట్టుకోడానికి నీ కెన్ని గుండెలు?'' కోపంగా అడిగాడు ఓ చైనీస్ సైనికుడు రైపిలు బాయ్‌నెట్‌తో అతని ముఖం పైకెత్తుతూ

ముషీరాం దీనంగా పెట్టాడుముఖం. ప్లీజ్! నన్ను క్షమించండి! అది మీ కష్టఫలితమని తెలియదు ఏదో దొరికింది గదా అని ఎగరేసుకొచ్చాను" అన్నాడు అతని చేతులు పట్టుకొని బ్రతిమాలుతూ.

"భారత సైనికులు ఇంత పిరికి వెధవలనుకోలేదు. మన వాళ్లే చాల బెస్ట్: నలుగురిలో ఒకడు కామెంట్ చేసాడు.

"మన జాతికీ, భారత జాతికి పోలికా! మనం పుట్టగానే సమరోత్సాహం నూరిపోస్తారు మన పెద్దలు. వీళ్ళు పుట్టగానే పిరికి మందు తాగుతారు గడగడా!" అంటూ పళ్ళికిలించాడు మరొకడు.

మిమ్మల్ని ఇంతదూరం రప్పించి చాల శ్రమ ఇచ్చాను. అందాక సిగరెట్లు తీసుకొని ముట్టించండి. ఈలోగా మీకు మాంసం పంచుతా" అన్నాడు వినయంగా మున్షీరాం.

సిగరెట్లు అనగానే జిహ్వా లేచివచ్చింది చైనీస్ సైనికులకి. చైనీస్ సైన్యానిక్కి సప్లైలు సరిగా ఉండవు.

కిట్‌లోంచి సిగరెట్ పాకెట్ తీసి ఇచ్చాడు నల్గురికీ. "మిస్టర్ మమ్మల్ని కాకాపట్టినంతమాత్రాన వదిలేస్తామను కోకు. నువ్వు చావకతప్పదు" అన్నాడు ఓ చిలికికళ్ళ సుందరాంగుడు సిగరెట్ ముట్టిస్తూ. మిగతా ముగ్గురుకూడా సిగరెట్లు పంచుకున్నారు.

"వద్దు. నన్ను చంపొద్దు. నన్ను యుద్ధఖైదీగా మీ స్థావరానికి తీసుకువెళ్ళండి. అందుకు ప్రతిఫలంగా మీకు కొన్ని సైనిక రహస్యాలు చెబుతాను.

"ఆల్‌రైట్" అంటూ, సిగరెట్‌కేసి ప్రేమగా చూస్తూ మూడు దమ్ములు లాగాడు ఆ చైనీస్ సైనికుడు. అంతే! గొంతుమాడినట్లయింది. మత్తుగా వాలిపోయాడు.

"మోసం! దగా!!" కీచుమంటూ అరిచాడు మరొకడు పైకిలేస్తూ.

రైఫిల్‌ని తిరగేసి, బారల్‌వైపు పట్టుకొని మున్షీరాం చటుక్కున పైకిలేచాడు. 8 పౌండ్ల బరువుగల రైఫిల్ గాలిలోకి లేచింది. అంతే! ప్రత్యర్థి మెదడు రెండుగా పగిలింది.

"సైతాన్ కా బచ్చే! భరతజాతిని విమర్శించే అర్హత కప్పలు, పాములు నమిలే మీ నోళ్ళకు ఉందా ?" అంటూ మరొకడి పొట్టలో మోకాలితో కుమ్మాడు. ఆ గుద్దులో కోట్లాది భారతీయుల బలం ఉంది. అతడు కడుపుపట్టుకొని బరువుగా వాలిపోయాడు. దమ్ములు గట్టిగా కొట్టడంవల్ల, నాలుగో సైనికుడిపై మార్ఫియా యంపిక్స్ ఉన్న సిగరెట్ అప్పటికే పని చేసింది.

"నాకు పనిలేకుండా చేసావ్!" అన్నాడు నవ్వుతూ కపాడియా ఎక్కడినుంచో వచ్చి.

'ఇంకా నయం. నాకుమాత్రం వీళ్ళ కడుపుల్లో కత్తులు దూర్చి తాళంచెవిలా తిప్పాలనిఉంది సాబ్!' ఆవేశంలో మున్షీరాం కంఠం వణికింది. అతని భుజం తట్టాడు కపాడియా. 'వాళ్ళు ఏదో అన్నారంటే అది వాళ్ళ తప్పు కాదు భయ్యా! వాళ్ళకి సైనికాధికారులు ఇచ్చిన టీచింగ్స్ అటువంటివి. కేవలం తమ సిపాయిలకి ప్రోత్సాహం ఇవ్వడానికి, భారతీయులు పిరికిపందలనీ, బలహీనులనీ ఏవేవో కల్పించి చెబుతారు. అయితే 1962 లోని భారతదేశానికి, ఇప్పటి భారత దేశానికీ అన్నిరంగాల్లోను ఎంతో తేడాఉందని వాళ్ళ అధికారులకి మాత్రమే తెలుసు!'

మున్షీరాం కొంతసేపటికి మామూలు స్థితికి వచ్చాడు. 'మున్షీ! నీకో కానుక!' అంటూ కపాడియా కిట్‌లోంచి భూటాన్ XXX రమ్ నిబ్ తీసాడు. కొంచెం తాగి బాటిల్ అతనికి అందించాడు.

'థాంక్యూ సర్' అంటూ మిగిలినది గడగడా త్రాగాడు మున్షీరాం. తల తిమ్మిరెక్కి హాయిగాఉంది ఇద్దరికీ.

కపాడియా సైనికుల దుస్తులు వెతికాడు. రెండు మాప్‌లు

కనబడ్డాయి. గబగబా విప్పాడు వాటిని. మున్షీరాం ఆత్రుతగా వాటిపై వంగాడు. 'మున్షీ! ఇప్పటిదాకా మనం ఉన్న ప్రాంతమేమిటో తెలియక చచ్చాం! 'లాంగ్ జూ'లో ఉన్నాం మనం. సాంగ్ధర్, 'చాంగ్ చన్ మో' లోయ దాటామంటే బమ్లా అక్షం చేరుకోవచ్చు. అక్కడే మనక్కావల్సిన టాంగ్ పాంగ్లా సైనికస్థావరం ఉండేది.

'సాబ్! సాంగ్ధర్ అంటే లాంగ్ పెప్లా సమీపంలోని పర్వతశ్రేణి కదూ!' గొణిగాడు మున్షీరాం.

'అవును. నీ సందేహం నాకర్థమైంది. ఇన్ని మైళ్ళదూరం శత్రువులను ఛేదించుకుంటూ నడిచివెళ్ళడం కష్టమే. దానికి రెమెడీ కాలమే చెప్పాలి' అన్నాడు కపాడియా.

స్పృహతప్పిన చైనీస్ సైనికుల దేహాల్ని చెట్లకు కట్టి నడక సాగించారు ఇద్దరూ.

# 5

అడ్డుగాఉన్న చెట్లు, చేమలు బాయ్‌నెట్‌తో నరుక్కుంటూ ముందు నడుస్తున్నాడు మున్షీరాం. అంతే! ధన్...ధన్... ధన్...ధన్... విరామం లేకుండా వినబడుతున్నాయి కాల్పులు.

వికృతంగా అరిచాడు మున్షీరాం. 'కమాండర్‌సాబ్! ముందుకు రాకండి!' అంటూ మొదలు నరికిన చెట్టులా కూలి పోయాడు. మున్షీరాం దేహం దొర్లుకుంటూ వచ్చి కపాడియా కాళ్ళకు అడ్డుతగిలింది.

అదిరిపోయాడు కపాడియా. చిల్లులుపడిన జల్లెడలా ఉంది మున్షీరాం శరీరం. రక్తం వరదలుకడుతోంది. మెషిన్ గన్‌మీద కపాడియా పిడికిలి బిగుసుకుంది. తారాజువ్వలా గుట్టమీదికి ఎక్కబోయాడు. అతని బూటుకాళ్లని మున్షీరాం

చేతులు ఆపివేశాయి.

'సా... బ్ ! నామాట....వినండి. తొందపడకం.... అక్కడ శత్రువులెవరూ...లేరు....మనం...ఫిల్‌బాక్స్...రేంజిలో పడ్డాం' అన్నాడు మున్‌షీరాం.

'ఫి...ల్...బా...క్స్!' గొణిగాడు కపాడియా. యుద్ధ భూమిలో శత్రువులను నాశనం చెయ్యడానికి అక్కడక్కడా ఫిల్‌బాక్స్‌లను స్థాపిస్తారు. అది ఒక మారణాయుధం. ఫిల్‌బాక్స్‌కి అన్నివైపులా మరతుపాకు లమర్చబడి ఉంటాయి. సైనికుడు లేకుండానే శత్రువుల జాడను తెల్సుకొని కాల్పులు కాల్చే స్వయంచోదిత యంత్రాలుంటాయ్ వాటికి.

మోకాళ్ళమీద కూర్చున్నాడు కపాడియా. అతని కళ్ళ నుండి ధారాపాతంగా స్రవిస్తున్న వెచ్చటి కన్నీళ్ళు మున్‌షీరాం రక్తసిక్తమైన ఛాతీలో ఇంకిపోతున్నాయ్.

'మున్‌షీ! నాకోసం నీ ప్రాణాలు బలిచేసావా ! ఇక్కడి దాకా తోడు వచ్చి ఇప్పుడు ఒంటరివాణ్ణిచేసి వెళ్ళిపోతావా !' అతని ముఖాన్ని చేతుల్లోకితీసుకొని చిన్నపిల్లాడిలా ఏడ్చాడు కపాడియా.

మున్‌షీరాం చివరిక్షణాల్లో నవ్వాడు. కాదుకాదు. జీవిత మంతా నవ్వుతూనే గడిపాడు. "సా...బ్! సేవకుడిగా,... మీకు,.... దేశానికీ....ఇంతకంటే.... సేవ చెయ్యలేక.... పోయాను. అయినా...నేను పుట్టినగడ్డమీదే...చచ్చిపోతున్నందుకు.. ఎంతో సంతోషంగా ఉంది.' లేనిశక్తి తెచ్చుకుని కుడిచెయ్యి కపాడియా భుజంమీద వేస్తూ అన్నాడు మున్‌షీరాం. 'సాబ్! మీరు నాలాంటి కోన్‌కిస్కాగాడికోసం బెంగ పెట్టుకోకూడదు. అసలు మిలిట్రీవాళ్ళకి ఇలాంటి పూర్ సెంటిమెంట్స్...ఉండకూడదు. వీరశివాజీ, రాణా

ప్రతాప్, ఝాన్సీరాణీ,...భగత్‌సింగుల్లాటి క్షాత్రమూర్తులు వెలసిన పవిత్ర .... భారతగడ్డమీద పుట్టాం .... మనం. ధైర్యంగా...తెలివిగా...ముందుకు సాగిపోండి' కాస్సేపాగి ఛాతీ నొక్కుకుంటూ గొణిగాడు మున్షీరాం. 'ఇప్పుడు... నాకు చాల హాయిగా ఉందిసాబ్! అదిగో.. భరతమాత... తన ఒడిలో...విశ్రాంతి తీసుకోమని...ప్రేమగా...పిలుస్తోంది. జైహింద్' శాల్యూట్ చెయ్యడానికి విఫలప్రయత్నం చేస్తూ మెడవాల్చేశాడు మున్షీరాం.

నిశ్చేష్టుడయ్యాడు కపాడియా. జరిగిన సంఘటనలన్నీ అతని కళ్ళముందు సినిమారీల్లా తిరిగాయి. మున్షీరాం చచ్చిపోవడం కలా, నిజమా? అనిపిస్తోంది కపాడియాకి. కాస్సేపు శూన్యంలో ఆలోచిస్తూ గడిపాడు.

తర్వాత పైకిలేచి, రైఫిల్ బాయినెట్‌తో గొయ్యి తవ్వడం ప్రారంభించాడు.

X X X X

"తను ఆ-పిల్‌బాక్స్‌ని ఎలాగైనా ధ్వంసం చేయ్యాలి! లేకపోతే తనకు మార్గంలేదు!.

నేలకు అతుక్కుపోయి ముందుకి పాకుతున్నాడు కపాడియా. (దానినే క్రాలింగ్ అంటారు). పిల్‌బాక్స్ పని చెయ్యడం ప్రారంభించింది.

దడదడ శబ్దంతో ఆ ప్రదేశం మారు మ్రోగిపోతోంది. గుళ్ళు కపాడియా నెత్తిమీదుగా దూసుకుపోతున్నాయి. తను ఏమాత్రం పొరపాటుగా తల పైకెత్తినా, ముఖం జల్లెడవుతుంది. కిట్‌ని వీపుమీద ఉంచుకొని పాకడంవల్ల అందులోని ఎమ్యూనిషన్‌కి గుళ్ళు తగిలి ప్రేలుడు జరిగే ప్రమాదముంది. అందుచేత, తాను మెల్లిగా కదులుతూ, కిట్‌ని నేలమీద

ఊడ్చేసాగాడు కపాడియా.

మోకాళ్ళు నొప్పి పుడుతున్నాయి. అక్కడక్కడా ముళ్ళు గుచ్చుకోవడంతో చర్మంరేగి మంటపెడుతోంది. గోరుచుట్టుపై రోకలిపోటు అన్నట్లు అడవి చీమలు అతని బూట్లలోకి దూరి, తేళ్ళలా కుడుతున్నాయి. మోచేతులు ఎప్పుడో కొట్టుకుపోయాయి. మోకాళ్ళవద్ద పాంటు చిరిగిపో యింది. ఇంకా 80 గజాల దూరం పాకాలి.

"ఎలాగైనా ఆ మారణాయుధాన్ని ధ్వంసం చెయ్యాలి. భగవాన్! నాకు ఆత్మవిశ్వాసం ప్రసాదించు" మనసులోనే స్మరించాడు దేవుణ్ణి. పళ్ళుబిగించాడు బాధను ఓర్చుకొంటూ కాస తలపైకెత్తి కాళ్ళకు పట్టిన చీమల బాధ వదిలించుకొని, మళ్ళీ ప్రయాణం చేద్దామా అంటే అతని బుర్ర పగులుతుంది

ధన్... ధన్... ధన్... నిర్విరామంగా వినబడు తున్నాయ్ ప్రేలుళ్ళు. పిల్ బాక్స్‌కి 15 గజాల దూరంలోకి వచ్చాడు కపాడియా. అతని కళ్ళు మెరిసాయ్. దైవానికి మనసులోనే కృతజ్ఞత లర్పించాడు. జేబులోని హాండ్ గ్రెనేడ్ మెల్లగాతీసి, నోటిముందుకు తెచ్చాడు. స్ప్రింగ్‌ని పళ్ళతో లాగి చెయ్యి పైకెత్తి, హాండ్ గ్రెనేడ్‌ని బలంగా విసిరాడు కపాడియా. తటాలున తలవంచి నెత్తిమీద చేతులు పెట్టుకొన్నాడు.

అంతే! అగ్నిపర్వతం బ్రద్దలైనట్లు ధడాల్‌న పెద్ద శబ్ద మైంది.

ఇనుప ముక్కలు ఆకాశంలోకి లేచాయి. కపాడియా నెత్తినిండా ఎవరో విసిరికొట్టినట్లు ఇసుక-ముద్దలు ముద్దలుగా పడింది. మోకాలి గాయనికి-ట్యూనికే బిగించి కట్టుకున్నాడు రక్తస్రావం ఆగడానికి. పైకి లేవబోతే నడుం కలుక్కు

మన్నట్లయింది. అప్పటికే అలసిపోయిన కమాండర్ కపాడియా మగతగా కళ్ళు మూసుకొని అలాగే ఉండిపోయాడు కొంతసేపు.

# 6

సెలయేరు కనబడగానే ప్రాణం లేచివచ్చినట్లైంది కపాడియాకు. గబగబ బట్టలు విప్పి ఓ పొదలో దాచాడు. ఆత్మ రక్షణకోసం కిట్ డ్రాయిర్‌కున్న సైడ్‌బకుల్‌లో చురకత్తిని దోపాడు.

చల్లగా తగిలాయి నీళ్ళు. కాస్సేపు జలక్రీడలాడాడు కపాడియా. అంతలో ఒడ్డుమీద చెట్లలో అలికిడయి అదరిపడ్డాడు కపాడియా. చెట్లమధ్య ఓ చైనీస్ సైనికుడి ఆకారం లీలగా కనబడింది. ఎండుటాకులు బూటుకాలిక్రింద నలిగిపోతున్న శబ్దం...

ఒక్క క్షణం మెదడు మొద్దుబారిపోయింది కపాడియాకి. తానిప్పుడేం చెయ్యాలి? ఒడ్డుకు చేరేలోపున తనపని "అవుట్". నీటి ఒడ్డుకు వస్తాడు శత్రువు. తను సులువుగా దొరికిపోతాడు. లేకపోతే నిర్దాక్షిణ్యంగా కాల్చి చంపుతాడు.

పెద్ద పెద్ద పద్మవ్యూహాలు పన్నిన భరత్ కపాడియా మస్తిష్కం సముద్రాన్ని పావు సెకనుగా తీసుకొని ఆలోచిస్తోంది. అతని శ్రమ ఫలించింది. మెదడులో ఏదో తళుక్కుమంది. పూనాలోని ఆర్మీ స్కూల్ ఆఫ్ ఫిజికల్ ట్రైనింగ్‌లో తాను నేర్చుకొన్న విద్యలు చక చకా జ్ఞాపకం వచ్చాయ్!.

జంగిల్ అండ్ మౌంటైన్ వార్‌ఫేర్‌లో సహాయపడ్డానికి ప్రతి సిపాయికీ కొన్ని శిక్షణలు ఇవ్వబడతాయ్. అందులో

ముఖ్యమైనవి- దొరికిన కర్రముక్కలతో నావలు సృష్టించుకొని ముందుకుపోవడం, చెక్కలతో తాత్కాలిక వసతి నిర్మించుకోవడం, అడవుల్లో విరోధిపైకి ఉరకడానిక్కి ఎలాంటి కీలక మైనస్థలాల్లో దాగియుండాలో. అలాగే శత్రువు అలాంటి ప్రదేశాల్లో దాగియున్నప్పుడు ఎలా ఎదిరించాలో తెలుసుకోవడం, రకరకాలుగా ఈదడం మొదలయినవి.

వాటిలో ముఖ్యంగా స్విమ్మింగ్ స్పెషలైజ్ చేసిన ఏరియా కమాండర్ కపాడియా, జలస్థంభన, వాయుస్థంభన విద్యల్లో ఆరితేరినవాడు.

కపాడియా ఆలస్యం చెయ్యలేదు. పొట్టఉబ్బించి, ఊపిరి బిగించాడు, కాళ్ళు, చేతులు, పారలల్‌గా సాచి కళ్ళు తేలవేసాడు. కపాడియా శరీరం ఇప్పుడు నీటిపై బెండుముక్కలా తేలుతోంది.

ఒడ్డుదాకా వచ్చిన చైనీస్ సైనికుడు మోకాళ్ళమీద కూర్చొని, తోలుతిత్తిలోకి నీటిని పట్టుకోబోయి ఎందుకో ఆగిపోయాడు.

అతనికి అనపకాయలా ఉబ్బిన కపాడియా శరీరం కనబడింది. ఏదో దెయ్యాన్ని చూసినట్టు, హడలిపోయి పైకి లేచాడు. కళ్ళు నలుపుకుని మళ్ళిచూసాడు. "సందేహంలేదు ఆది శవమే!" అనుకున్నాడు. శవం కల్సిన నీటిని తీసుకెళ్ళడం ఇష్టంలేక చైనా భాషలో కిచకిచ తిట్టుకుంటూ వెనుదిరిగాడు. అంతే! మరుక్షణం కిక్కురు మనకుండా నేలమీదకి ఒరిగిపోయాడు బరువుగా. కారణం ?.

కపాడియా మొలకున్న చురకత్తి అప్పటికే నాటుకుంది శత్రువు కంఠలో.

చక చకా ఒడ్డుచేరాడు కపాడియా. గబగబా తన దుస్తులు

ధరించి ప్రత్యర్థి శరీరాన్ని పొదలోకి లాగేసాడు.

"తొందరగా రావోయ్! ఆకలేస్తోంది. ఎంతసేపు నీళ్ళు తేవడం?" దూరంగా ఓ చైనీస్ సైనికుడి కేక విన బడి ఉలిక్కిపడ్డాడు కపాడియా.

కాస్సేపు అతన్ని ఏడిపించాలని బుద్ధిపుట్టింది కపాడి యాకి తాను బంపిన సైనికుడి కోసం ఆ రెండోవాడు ఎదురు చూస్తాడు. ఎంతకీ రాకపోతే తనే ఇటు వస్తాడు. అప్ప టికి తను సిద్ధంకావాలి!

కత్తితో గబగబా చెట్ల కొమ్మలు నరికాడు కపాడియా. వాటిని తన శరీరం చుట్టూకట్టుకొని ఓ పొదముందు కాచు కున్నాడు. దానినే కామఫ్లేజ్ అంటారు. శత్రువుల మధ్య నుండి చెట్ల వేషంలో పారిపోడాన్కి ఈ పద్ధతి ఉపకరిస్తుంది.

చైనీస్ సైనికుడు గొణుక్కుంటూ వచ్చి అటూ ఇటూ చూసాడు. ఎంతకీ కనబడలేదు తన సహచరుడు, ఒకరి గురించి ఒకరు బాధపడే ఓపిక. అలవాటు, చైనీయుల్లో ఉండదు. మౌనంగా కామఫ్లేజ్ వేషంలో ఉన్న కపాడియా వద్దకు వచ్చికూర్చొన్నాడు, అది చిన్నపొద అని భ్రమించి. నవ్వొచ్చింది కపాడియాకి. చేతిలో రైఫిల్‌స్లంగ్‌ని రడీగా ఉంచుకున్నాడు (రైఫిల్‌కు ఉండే బెల్టుని సైనిక భాషలో స్లంగ్ అంటారు).

చైనీయుడు హుషారుగా విజిల్ వేసుకొంటూ రేషన్ బాక్స్ విప్పాడు.

వొంతొచ్చినంత పనైంది కపాడియాకి. చైనీయుడు ఆవురావురమంటూ నవుల్తున్నాడు కప్పల కూరని. అప్ప డప్పుడు ఉడకబెట్టి మషాళా పెట్టిన అడుగుపొడవున్న పాముల్ని కొంచెం కొంచెం కొరుక్కు తింటున్నాడు.

ఒళ్ళు జలదరించింది కపాడియాకి. తినడం పూర్తిచేసి త్రేన్చుకుంటూ పైకి లేవబోయాడు చైనీస్ సైనికుడు. అయితే అతని కంఠం చుట్టూ రైఫిల్‌స్లింగ్ బిగుసుకొని ఉంది.

అదిరిపోతూ తలపైకెత్తాడు చైనీ. కొమ్మల మధ్య కోపంగా ఉన్న కపాడియా ముఖం కనబడింది.

"నీ రాంక్ ఏమిటి? ఉరిమాడు కపాడియా

"మామూలు సైనికుడినే"

"నిజం చెబుతున్నావా? లేకపోతే సైనిక రహస్యాలు చెప్పవలసి వస్తుందని అబద్ధమాడుతున్నావా?" రైఫిల్ స్లింగ్ మరింత బిగిస్తూ అడిగాడు కపాడియా

"లేదు నిజమే చెప్పాను"

రక్తం స్టాకయి పోవడం వల్ల అతని ముఖం కందగడ్డలా తయారైంది.

"చెప్పు మీ ట్రూప్స్ ఎక్కడెక్కడ ఉన్నాయి? ఇప్పటి వరకూ ఏ ఏ స్థావరాలు ఆక్రమించుకున్నారు?"

"నాకు తెలియదు"

నడ్డిమీద తన్నాడు కపాడియా.

"చెప్తాను, మరినన్ను చంపకేం" భయం భయంగా చూసాడు చైనీ.

"అది ఆలోచించాల్సిన విషయం. ముందు విషయాలు కక్కు, లేకపోతే నువ్వు తిన్న పాములు, కప్పలు ఒకటొకటిగా బయటికి వస్తాయ్!"

"కరెక్టుగా చెప్పడం కష్టం. మా ట్రూప్స్‌ని రాత్రివేళ అక్కడక్కడా దింపుతున్నారు. ఇప్పటి వరకు, దోమ్‌లా, వాలాంగ్ మాత్రం వశపరచుకున్నట్లు తెల్సింది. చుంగ్

చన్‌మోలోయ వద్ద కేంద్రీకృత మౌతున్నాయి మా సేనలు. మావాళ్ళ ఫైనల్ ఎయిమ్ కీలక స్థానమైన టాంగ్ పౌంగ్లె."

"సౌ్కండ్రల్స్! మీరు టాంగ్‌పౌంగ్లా వశపరుచుకో గల్గితే ఖచ్చితంగా నేను గాజులు తొడుక్కుంటాను" పళ్ళు కొరికి అన్నాడు కపాడియా. బెల్టులు బిగుసుకొన్న చైనీయుడి బుర్రని సంచి మూతి బిగించినట్లు ఓ సారి అటూ యిటూ జాడించాడు.

నరాలు తెగినట్లనిపించింది చైనీయుడికి "నేను చెప్పిందంతా నిజం. నన్ను చంపేస్తావా? హీనంగా పలికాడు. చైనీ.

"కాదు. ఓకాలు నరికి వదిలేస్తాను. దేకుతూపోదువ్ గాని".

గజ గజా వణికిపోయాడు ఆ చైనీస్ సైనికుడు. ప్లీజ్ ఆ పని మాత్రం చెయ్యకు! కావలిస్తే చంపెయ్! గాయ పడిన వారికి అస్సలు విలువలేదు మా సైన్యంలో. 'డెడ్ వైట్ క్రింద జమకట్టి మా వాళ్ళే పూర్తిగా చంపేస్తారు."

కపాడియా కను బొమ్మలు ముడి పడ్డాయ్ "అంటే? వివరంగాచెప్పు" స్లంగ్‌లూజ్ చేసాడు కపాడియా 'మీ భారత సైన్యంలో గాయ పడిన వారిని సుస్థిర స్థానాలకు చేర్చి బహు జాగ్రత్తగా చూస్తారు. మా సైన్యంలో అలాంటి చెడ్డ అలవాట్లు ఉండవ్. గాయపడ్డ జవాన్లకు మందు లివ్వడం, తిండిపెట్టడం వృధా అని మా అధికారుల సిద్ధాంతం. సగం ప్రాణం ఉండగానే తోటి చైనీయుణ్ణి కాల్చిచంపి ముందుకుపోతారు మా వాళ్ళు. ఈ సిద్ధాంతం క్రింద బలయ్యే సైనికులనే "డెడ్‌వైట్" అంటారు. 'ప్రివెన్షన్ ఈజ్ బెటర్ దాన్ క్యూర్' అన్న ఒక్క ఇంగ్లీష

సూక్తి మాత్రము చైనీయులు పాటిస్తారు. మిగతా వన్నీ మావో సూక్తులే;"

కపాడియా హృదయం కరిగిపోయింది. చూస్తూ చూస్తూ అతన్ని చంపడానిక్కి చేతులు రావడం లేదు. కొంతసేపటికి అన్నాడు తేరుకొని.

"నన్ను క్షమించుభాయ్! నిన్ను వదలకూడదు. ముందు జాగ్రత్తగా నన్ను నేను రక్షించుకోకతప్పదు. కనుక నిన్ను ఓ చెట్టుకి బంధిస్తాను. రేషన్‌బాక్స్ దగ్గిర ఉంచుతాను. కొద్ది గంటల్లో కాకపోయినా ఒకటిరెండు రోజుల్లో మీ వాళ్ళు ఇటువస్తే నిన్ను విడిపిస్తారు. లేదు భారత జవానులు వస్తే నిన్ను క్షేమంగా, యుద్ధఖైదీగా తీసుకువెళతారు," నువ్ ప్రతిఘటించవుగాబట్టి."

చైనీస్ సైనికుడి కళ్ళు చెమ్మగిల్లాయి. "మీరు నిజంగా చంపేస్తారనుకొన్నాను. భారతీయులు చాల క్రూరులని మా ట్రైనింగ్ క్లాసులో చెప్పేవాడు."

పేలవంగా నవ్వాడు కపాడియా. తనపని ముగించుకొని అక్కణ్ణించి కదిలాడు.

# 7

చీకటి పడింది.

కుంభవృష్టిగా వర్షం కురుస్తోంది. రాత్రి 7 గంటలే అయినా అడవిప్రాంతం కావడంవల్ల అర్ధరాత్రిలా ఉంది.

లాంగ్ కోటు కాలర్ పైకెత్తుకుని ఎయిమ్‌లెస్‌గా నడుస్తున్నాడు కపాడియా. చలివల్ల అతని పెదాలు వణుకుతున్నాయ్. టార్పాలిన్ క్లాత్‌తో తయారు చేయబడ్డంవల్ల 'కిట్' తడిసినా పర్వాలేదు. టార్చిలైట్ కాంతిలో వాలుగా పడుతున్న వర్షపుచినుకులు స్పష్టంగా కనబడుతున్నయ్.

అంతలో ఆకాశంలో ఏదో శబ్దమైంది. ఉలిక్కిపడి తల పైకెత్తాడు కపాడియా. హెలికాప్టర్ ఇంజన్ శబ్దం అది. కపాడియా మెదడులో ఏదో ఆశ పొడచూపింది. అది శత్రువులదైతే తన చేతిలోని LMC గర్జించక తప్పదు. ఇండియన్ ఎయిర్‌ఫోర్స్‌కు సంబంధించిన హెలికాప్టరైతే తన కోడ్‌సిగ్నల్ గ్రహించి తప్పక లాండ్ అవుతుంది.

ఆలస్యం చేయలేదు కపాడియా. టార్చిని హెలికాప్టర్ వైపు తిప్పి వెలిగీ, ఆర్పి ఏవో సిగ్నల్సు ఇచ్చాడు. హెలికాప్టర్ రెండుగిరికలు కొట్టి క్రిందకు దిగసాగింది.

"అంటే తన సిగ్నల్ పైలట్ కర్థమైందన్నమాట!" కపాడియాలో ఉత్సాహం ఉటికింది.

వెంటనే హెలికాప్టర్ వైపు పరిగెట్టాడు. అతని బూటు కాళ్ళు బురదను చిమ్మసాగాయి. ఏదో రాయి తగిలి తూలి పడ్డాడు కపాడియా. టార్చి బురదలో కూరుకుపోయింది. అరచేతులకి మట్టి అంటుకొంది. మళ్ళీ చీకటి.

కాబిన్‌లో ఉన్న వ్యక్తి డోర్ తెరిచి క్రిందకు దిగాడు.

"మిస్టర్! హెలికాప్టర్ ఇంజన్ శబ్దాన్నిబట్టి వచ్చేయండి." అర్చాడు అతను వర్షం హోరులో.

కపాడియా తడుము కుంటూ అతని వద్దకు వచ్చాడు.

ఇద్దరూ హెలికాప్టర్‌లో కూర్చున్నారు.

"మిస్టర్..." పిల్చాడు కపాడియా.

"జస్ బీర్ సింగ్" అందించాడు ఆ వ్యక్తి.

"మిస్టర్ జస్‌బీర్ సింగ్! కాబిన్‌లో చీకటిగా ఉంది. ఎలా డ్రైవ్ చేస్తున్నారు?"

"ఇప్పటిదాకా మోకాళ్ళమధ్య టార్చిలైట్ పెట్టుకొని ఏవోపాట్లు పడ్డాను. అయితే మీకోసం 'కాప్టర్ లాండింగ్'

చేస్తున్నప్పుడు అది కిందకు జారి బల్బు పగిలింది. ఏదో చెయ్యాలి మనం"

"గుడ్ గాడ్ ! అరిష్టాలన్నీ ఒకసారే దాపురించాయ్" క్రిందిపెదవి కొరుక్కున్నాడు కపాడియా. చకచకా ఆలోచించ సాగాడు. తల పంకించి నెట్‌లోంచి భూటాన్ XXX రమ్ బాటిల్ తీశాడు. బయట మెరుపులు మెరుస్తున్నాయ్. "ఇదేంవిటి ? దీపంలేక చస్తుంటే మందు కొడతాడా కొంప తీసి !" గొణుకున్నాడు జస్‌బీర్‌సింగ్. కపాడియా కర్చీఫ్ తీసి చిన్నచిన్న పేలికలుగా చీరాడు. వత్తిక్రింద తయారు చేసాడు వాటిని. బాటిల్లోని ద్రవంలో వత్తినితడిపి బయటకు వచ్చేటట్లు అమర్చాడు. అగ్గిపుల్ల ఎలిగించాడు.

ఇపుడు రమ్ బాటిల్ పెద్దసైజు కొవ్వొత్తిలా వెలుగుతోంది.

"యు అర్ జీనియస్ మిస్టర్..." అంటు ఆగాడు సింగ్

"కపాడియా" అంటూ నవ్వి తన ఐడెంటిఫికేషన్ చూపించాడు భరత్. అందులో తనఫొటో, రాంక్, గుర్తులు అన్ని వివరంగా ఉన్నాయి.

"గ్లాడ్ టు సీ యు సర్" అన్నాడు చెయ్యిజాపుతూ సింగ్.

"సో యామ్ ఐ"

"ఆయామ్ పైలట్ ఆఫీసర్ జస్‌బీర్‌సింగ్."

"ఐ. సీ. ఏమిటి భాయ్ ! ఇంత రాత్రివేళ హెలికాప్టర్ నడపడానికి మీ వింగ్ కమాండర్ ఎలా ఒప్పుకొన్నాడు?"

తలవంచుకొన్నాడు జస్‌బీర్‌సింగ్ జమీధాంగ్ హెలికాప్టర్ స్థావరం నుండి వస్తున్నాను. మిస్టర్ కపాడియా ! బాంగ్‌బన్‌మోభాయి దగ్గర మన జవాన్లకి రేషన్సు, వెపన్సు లేక అయోమయంలో పడ్డారని వార్తవచ్చింది. ఏ క్షణంలో

నైనా చైనీయులు ఆ నిస్సహాయుల్ని ఎటాక్ చెయ్యవచ్చు. అందుకే తెగించాను ఇంతరాత్రివేళ సప్లైలు తీసుకెళ్ళడానికి. కమాండర్ ఒప్పుకోలేదు. బ్రతిమాలి బయల్దేరాను.''

''మీ సాహసానికి నా జోహార్లు మిస్టర్ జస్‌బీర్‌సింగ్! నేను ఏ ముఖ్యమైన బాధ్యతతో బయలుదేరానో, మీ పని అయినతర్వాత నన్ను వీలైతే టాంగ్‌పాంగ్లా స్థావరంలో దిగబెట్టాలి''

"ఎట్ యువర్ సర్వీస్ మిస్టర్ కపాడియా. ఇక బయలు దేరదాం" అంటూ జస్‌బీర్‌సింగ్ ఇన్‌స్ట్రుమెంట్ పానల్ కేసి చూసి ఏదో నొక్కాడు.

హెలికాప్టర్ గాలిలోకి లేచింది.

కాబిన్ అంతా వెలుతురుగా ఉంది. కపాడియా సీటు వెనక్కి తలతిప్పి చూసాడు. వెనుకగా కొన్ని సెమి ఆటో మాటిక్ ఇషాపూర్ రైఫిల్స్ 22 మరియు 303 రైఫిళ్ళు, మరికొన్ని 3.7 ఇంచ్ హోవిడ్జర్స్ పడివున్నాయి. ముందుగా వండబడి డీహైడ్రేట్ చెయ్యబడిన మాంసం, బియ్యం, బంగాళాదుంపలు, ఉల్లిపాయలు, కారట్, కాబేజెస్ మొ॥నవి పాలిథిన్ బాగ్స్‌లో ఎయిర్‌టైట్ పాక్ చెయ్యబడి ఉన్నాయి. వాటిమీద డిఫెన్స్ మినిస్ట్రిస్ ఫుడ్ రీసెర్చి లేబొరేటరీ, మైసూర్ అన్న అక్షరాలు ముద్రించబడి ఉన్నాయ్.

అద్దంలోంచి ముందుకు చూసాడు కపాడియా. వర్షం తగ్గుముఖం పట్టింది. ఎత్తైన వృక్షాగ్రాలమీంచి పరిగెడు తోంది హెలికాప్టర్.

# 8

'ఇంకో పది నిమిషాల్లో చేరుకుంటాం' అన్నాడు స్పీడో మీటరుకేసి చూస్తూ జస్‌బీర్‌సింగ్.

'చేరిన తర్వాత [ప్రొసీజర్ ఎమిటి? హెలికాప్టర్‌లోంచి సామ్రగ్రి క్రిందకు విడిచెయ్యాలా లేక కాప్టర్‌ని జవాన్ల మధ్య దింపాలా!'

బోయింగ్ విమానమైతే లాండ్ అవడానికి అనుకూలంగా ఉండదు. హెలికాప్టర్ కాబట్టి, దిగి, పరిస్థితులు తెలుసు కొందాం'.

'వెల్. మనవాళ్ళుండే స్పాట్‌ని రికగ్నైజ్ చెయ్యడం ఎలా?' వృత్తాకారంలో ఓ గీతగీసి మధ్యలో జెండా పాతి ఉంచుతారు. టార్చికోడ్ ఎలాగు ఉండనే ఉంది వాళ్ళు మన మిత్రులే అని తెలుసుకోడానికి.

అంతలో క్రింద ఎక్కడో ధన్....ధన్....ధన్.... మంటూ కాల్పులు వినపడసాగాయి. అదిరిపడ్డారు ఇద్దరూ.

'మిస్టర్ జస్‌బీర్‌సింగ్!' కంగారుగా అర్చాడు కపాడియా.

'ఆలోచిస్తున్నాను మిస్టర్ కపాడియా! సరిగ్గా గమనిం చండి. అది సబ్-మిషిన్‌గన్ చప్పుడులా ఉంది'.

'అవును, అయితే?'

'శత్రువులు అక్కడక్కడా పొంచిఉన్నారు గొరిల్లా దెబ్బలు తియ్యడానికి. వాళ్ళు ఎక్కువ సంఖ్యలో ఉంటే ఈపాటికి యాంటి ఎయిర్‌క్రాఫ్ట్ గన్ రంగంలోకి ఉరికేది. ఈ కాల్పులనుంచి తప్పించుకొని మరో అయిదు నిమిషాలు ప్రయాణంచేస్తే. మనవాళ్ళ ఒడిలో పడతాం' అంటూ స్పీడ్ పెంచాడు జె. బి. సింగ్.

హెలికాప్టర్ కుడివైపునుంచి దూసుకుపోతున్నాయి నిప్పు రవ్వలు. 'మిస్టర్ కపాడియా సేఫ్టీబెల్ట్స్ గట్టిగా బిగించుకోండి. కొన్ని ప్రికాషన్స్ తీసుకొంటున్నాను' అంటూ హెలికాపర్‌ని కుడివైపునుంచి ఏటవాలుగా నడపసాగాడు జస్‌బీర్‌సింగ్.

దానివల్ల క్రిందనుంచి వచ్చే తుపాకిగుళ్ళు ఫ్యూయిల్‌టాంకుకు తగిలే ప్రమాదం లేదు.

'మిస్టర్ జస్‌బీర్‌సింగ్ ! హెలికాప్టర్ కుడిరెక్క మండుతోంది' అరిచాడు కపాడియా.

'ఇంకా మూడు నిముషాలు' హైట్‌ని పెంచుతూ అన్నాడు సింగ్.

'మిస్టర్ సింగ్ మంటలు కాబిన్‌వైపు దూసుకువస్తున్నాయి. ఏదో చెయ్యాలి మనం'.

ఫైర్ ఎక్స్‌టింగ్ విషర్ బటన్ నొక్కాడు. అయితే అప్పటికే మంటలు తీవ్రతరంఆవడంవల్ల లాభంలేకపోయింది.

"మిస్టర్ కపాడియా ! మీకో పని అప్పచెప్పక తప్పదు. ఏమనుకోరు కదూ!" దృష్టిని డ్రైవింగ్‌మీద నిలిపి అన్నాడు సింగ్.

"ఓహ్ ! యు ఆర్ ఏ మాన్ ఆఫ్ ఆర్థోడాక్స్ మిస్టర్ సింగ్! త్వరగా చెప్పండి."

"సీటు క్రింద మూడు పారాచూట్‌లు ఉంటాయి. మీరు ఒకటి తీసుకోండి. సామగ్రి అంతటిని మూటగా కట్టి డ్రాప్ చెయ్యడానికి రెడీగా ఉంచండి. మూడోది నా నడుముకు కట్టాలి. వుయ్ నీడ్ క్విక్ యాక్షన్".

అతను చెప్పినట్లు చేశాడు కపాడియా.

"అదిగో భారత జెండా!" ఉత్సాహంగా అరిచాడు జె. బి. సింగ్. మంటలు కాబిన్‌లోకి దూసుకువచ్చాయి.

"మిస్టర్ కపాడియా! నేను చెప్పగానే దూకండి. దిగేటప్పుడు జాగ్రత్త. ఖంగారులో పారాచూట్ విచ్చుకోకపోతే ప్రమాదం. భూమిని తాకగానే డైరక్ట్‌గా కాళ్ళు అన్చకూడదు నేలమీద. అలాఅవుతే బోన్స్ బ్రేక్ ఆవుతాయ్. నేల కనపడ

గానే, నీవు నేలమీద అన్ని మొగ్గవేసి పైకి లేవాలి. నీవెనుకే నేనూ వస్తాను."

హెలికాప్టరు అటూఇటూ ఊగుతుంది.

కపాడియా పారాచూట్ నడుముకు బిగించుకుని రెడీ అయ్యాడు.

జస్‌బీర్‌సింగ్ కుడిచెంప కాలుతోంది.

"డ్రాప్ ది నెం. 1 పారాచూట్!" అరిచాడు సింగ్.

కపాడియా, సామగ్రిఉన్న పారాచూట్‌ని క్రిందకు తోశాడు.

"నౌ జంప్ డౌన్ మిస్టర్ కపాడియా!" రెండోసారి అరిచాడు సింగ్.

"హోప్ ది బెస్ట్ మిస్టర్ సింగ్!" కపాడియా చెయ్యిఊపి డోర్ తెరచుకొని గాల్లోకి దూకాడు.

పారాచూట్ గొడుగులా విచ్చుకొంది.

చేతులు పైకెత్తి పారాచూట్‌ను గట్టిగా పట్టుకొని, అటు ఇటు చూశాడు కపాడియా. చీకటిగా ఉండడంవల్ల జస్‌బీర్ సింగ్ ఉన్న పారాచూట్ కాని, సామగ్రి ఉన్న పారాచూట్ గాని కనబడ్డంలేదు. క్రింద టార్చిలైట్లు వెలుగుతున్నయ్.

హెలికాప్టర్ రెక్కలుతెగిన పక్షిలా పల్టీలు కొడుతూ, రాకెట్ వేగంతో ఓ కొండ శిఖరాన్ని గుద్దుకొనడం కపాడియాకి కనబడింది.

# 9

"అంతా వెదికారా?"

"వెదికాం సాబ్! సామగ్రి ఉన్న పారాచూట్ ఓ చెట్టుకి చిక్కుకొంటే దాన్ని జాగ్రత్తగా దింపాం. అయితే జస్‌బీర్ సింగ్ పారాచూట్...లోయలో పడిపోయిందని నా అను

మానం" రొప్పుతూ చెప్పాడు ఘర్‌వాల్ రైఫిల్ దళ నాయకుడు టాండన్

జేబులో బాంబు ప్రేలినట్లయింది కపాడియాకి

"ఇం.. పా...సి...బు...ల్!" గొణిగాడు కపాడియా

మౌనంగా తన చేతిలోని హాట్‌ని కపాడియా కిచ్చాడు టాండన్.

"ఇది లోయ అంచుమీద దొరికిందిసాబ్! అందుకే అలా ఎక్స్‌పెక్ట్ చేసాను."

తల పగిలిపోయింది కపాడియాకి టోపీని పరిశీలించ సాగాడు. టోపీమీద రెక్కలుచాచి నిలబడిన, ఓ విమానం బొమ్మ ఉంది. దానిక్రిద ఐ.ఎ.ఎఫ్. అన్న అక్షరాలు మెరుస్తున్నాయ్.

సందేహంలేదు అది జె బి సింగ్‌దే. కాక్‌పిట్‌లోంచి అలస్యంగా దిగడంవల్ల, లాండిగ్ లేటయ్యి లోయలో పడిపోయి ఉండొచ్చు. మృత్యుగహ్వరంలోకి దూకుతూ తన ఉనికి తెలియ పర్చడానికి టోపీని బయటకు విసిరి ఉంటాలి. అయితే...అయిదునిమిషాల క్రితం తనకెన్నో జాగ్రత్తలు నేర్పిన సింగ్ ఇకలేడా?

కపాడియా మెదడులో ఆలోచనలు పాముల్లా మెలికలు తిరిగాయ్.

ఐదునిమిషాల తర్వాత—

"సాబ్! ఇదే జంగ్ నౌరానంగ్ వంతెన. ఈ బ్రిడ్జి లోయను అటుఇటు కలుపుతుంది. దీని రక్షణ భారం మాఘర్‌వాల్ రైఫిల్ దళంమీద పడింది. వంతెన కూలిపోతే అయిదారు భారత స్థావరాలకు ఆహార సామగ్రి, మందుగుండు సామగ్రి రవాణా చెయ్యడం దుర్లభమై పోతుంది.

టాంక్‌లు ట్రక్కులు నడవడానికి వీలుండదు.

"ఉదయం శత్రుసైనికులు వేలసంఖ్యలో చొరబడి ఈ బ్రిడ్జిని బొంబార్డ్ చెయ్యడానికి ప్రయత్నం చేశారు. ఇరువైపుల మూడు గంటలపాటు యుద్ధం జరిగింది. చైనీస్ కుట్ర ఫలించలేదు. నా అనుచరులు తోక త్రొక్కిన త్రాచుల్లా, రెచ్చిపోయి ఒక్కొక్కడు కనీసం పాతికమందిని చంపాడు."

రెండు వేలమంది శత్రువులు మట్టికరిచారు, సైనిక చరిత్రలో అస్సాం రైఫిలర్స్ ఘటికులని మరోసారి నిరూపించుకున్నారు. మా రిజిమెంట్‌లోని జవాన్లు. అయితే మా వద్ద రేషన్స్ అయిపోయాయి. మందు గుండు సామగ్రి పూర్తిగా ఖర్చయ్యింది. శత్రువులు మళ్ళీ ఏ క్షణాన్నైనా విరుచుకు పడతారని గుండె అరచేత పట్టుకొని కూర్చున్నాం. జస్‌బీర్ సింగ్ - మా కోసం త్యాగం చేసారు, టాండన్ మాటలు పూర్తికాకుండానే బ్రిడ్జి అవతలవైపు కాల్పులు వినబడసాగాయి

X X X X

ఓ చెట్టుకొమ్మమీద కూర్చొని ఉన్నాడు కపాడియా. అతని చేతిలోని లైట్ మెషిన్‌గన్ నిర్విరామంగా పని చేస్తోంది. ఏ మాత్రం ఎదురు గుండు తగిలినా పిట్టలా రాలి పడతాడు తను.

ఆ ప్రదేశమంతా ధన్-ధన్ - మన్న శబ్దాలతో కర్ణహేయంగా ఉంది. అప్పటికి పోరు ప్రారంభమై అరగంటైంది. తను సుమారు 50 మంది శత్రువులని చంపగలిగాడు. కపాడియా ఓ సారి క్రిందకి చూసి అదిరిపడ్డాడు.

భారత జవాన్ల శవాలు అకడక్కడా అస్తవ్యస్తంగా

పడివున్నాయి. రక్తంతో తడిసి నేల భయంకరంగా ఉంది. బంకర్లో కూర్చొన్న టాండన్ సెల్ఫ్‌లోడింగ్ రైఫిల్, సాండ్ బాగ్ మీద ఆన్చి ధనధానా కాలుస్తున్నాడు. అతనికి తెలుసు తన వాళ్ళంతా "ఖతం' అయ్యారని. అయినా నాయకుడిగా తన బాధ్యత తను చేసుకుపోతున్నాడు.

షార్ట్‌ఫోకస్ బైనాక్యులర్స్ కళ్ళు ముందుంచుకొని రేంజ్ స్క్రూ అడ్జెస్టు జేస్తూ బ్రిడ్జి అవతలి వైపు చూసాడు కపాడియా. ఓ నిమిషం తర్వాత స్వేచ్ఛగా ఊపిరి పీల్చాడు. మూడు అంకెల్లో ఉన్న శత్రువులు రెండు అంకెల్లోకి తగ్గారు. నోట్లో లెక్క పెట్టుకొన్నాడు శత్రువుల్ని కపాడియా.

"ట్వెల్వ్ ఫైవ్స్..." గొణుక్కున్నాడు.

అంటే 60 మందిని తను, టాండన్ కలిపిచంపాలి. కొంపదీసి మళ్ళీ కొత్తసేనలు వస్తే...

వాళ్ళవెనుక ఆకుపచ్చని జీపు నిలబడి ఓ చైనీస్ అధికారి కీచుగా అరుస్తూ ఏమో ఆర్డర్స్ ఇస్తున్నాడు.

ఆలోచనల్లోంచి తేరుకొని అప్రయత్నంగా క్రిందకుచూసాడు కపాడియా. మరుక్షణం "టాండన్! ఏమిటినువ్ చేస్తున్నది?" అంటూ కంగారుగా అరిచాడు.

మొలచుట్టూ ఏవో కట్టుకుంటున్న టాండన్ ఓసారి పైకి చూసాడు "శత్రువులను ఇలా దాగుడుమూత లాడుతూ మనిద్దరం ఎంతోసేపు ఎదుర్కోవడం కష్టం సాబ్! అధికారులు ఎంతో నమ్మకంతో ఈ వంతెన రక్షణభారం నా మీద వేసారు. అందుకోసం నా ప్రాణాలు బలిపెట్టక తప్పదు."

"డోంట్ బి హేస్టీ మిస్టర్ టాండన్! నామాట విను. ఇద్దరం కలిసి మరోమార్గం ఆలోచిద్దాం," అతన్ని వారిస్తూ చెట్టు దిగబోయాడు కపాడియా. అప్పటికే ఆలస్యమైంది.

వంతెనమీద బల్లిలా అతుక్కుపోయి జరజరా ముందుకు పాకుతున్నాడు టాండన్.

"మైగాడ్ ! ఒక్క మామూలు హాండ్‌గ్రెనేడే పెద్దగా ప్రేలి ఆరుగజాల వైశాల్యం గల గొయ్యి ఏర్పరుస్తుంది. అలాంటిది టాండన్, శత్రువుల మధ్య కురకదానికి ఉక్కు టాంకులను సైతం విధ్వంసంచేసే. డజను యాంటీ టాంక్ గ్రెనేడ్‌లను తన మొలచుట్టూ కట్టుకువెళ్ళాడు" ఫలితాన్ని ఊహించలేకపోతున్నాడు కపాడియా.

వంతెన దాటగానే "జయ్ ! భారత్ !" అని పిచ్చిగా అర్చుకుంటూ గబగబా శత్రువుల ముందుకు పరిగెత్తాడు టాండన్.

"వంతెన దాటి వచ్చేదాకా ఏం చేస్తున్నారు ? షూట్ హిమ్ ఇడియట్స్ !"

దూరంగా జీప్‌మీద ఉన్న చైనీస్ ఆఫీసర్ గర్జించాడు. అంతే ! ప్రళయకాల రుద్రునిలా పరిగెడుతున్న టాండన్ మీదకి 88 తుపాకులు గురి పెట్టబడ్డాయి.

. ఢన్...ఢన్...ఢన్ ..

జర్కు ఇస్తూ కసిగా పేలుతున్నాయి తుపాకులు.

పాపం ! చైనీస్ సైనికులకి తెలియదు. తాము షూట్ చేస్తున్నది తమమధ్య పడుతున్న 12 బాంబులనని !!

అంతే ; చైనాతుపాకుల గుళ్ళు టాండన్ మొలచుట్టూ ఉన్న బాంబులను కన్నించాయి: యాంటీటాంక్ గ్రెనేడ్స్ తమ డ్యూటీ తాము చేసాయి. అగ్నిపర్వతాలు ప్రేలాయి. ముందుగా అందరి చెవులు పగిలాయి. టాండన్ శరీరం గాలిలో కెగిరింది ఖండ ఖండాలుగా !! రక్తపుధారలు పిచికారీలా చిమ్మాయి. నేలమీద చిక్కటి, ఎఱ్ఱటి ద్రవాలు

కల్సాయి ! అందులో ఏది చైనీస్ రక్తమో. ! ఏది టాండన్ రక్తమో చెప్పడం కష్టం !!

# 10

''హాండ్సప్ అండ్ గెట్ డవున్ మైడియర్ చైనీ ఫ్రెండ్ !'' కరుగ్గా వినబడ్డాయా మాటలు.

క్లచ్ నొక్కి జీప్ స్టార్ట్ చెయ్యబోతున్న చైనీస్ అధికారి ఉలిక్కిపడి ప్రక్కకి చూశాడు.

ఎదురుగా—రక్తంపొంగే మొహంతో నిలబడి ఉన్నాడు కపాడియా. అతని చేతిలోని లైట్ మెషిన్‌గన్ కాటు వేయ బోయే కాలసర్పంలా మెరుస్తోంది.

చేతులు రెండు పైకెత్తి నెత్తిమీద పెట్టుకున్నాడు చైనీస్ ఆఫీసర్, కపాడియా చేతిలోని మారణాయుధంకేసి భయం భయంగా చూస్తూ.

"ఇంతమంది సహచరుల చావుకు కారణమై టోపీతీసి కనీసం రెండు నిముషాలైనా మౌనం పాటించకుండా, తోక ముడుచుకొని వెళ్ళిపోవడం మాసర్స్ నేర్పిన అధికారి లక్షణ మేనా భాయ్ ?''

కపాడియా బుగ్గలలో రక్తం పరిగెడుతోంది.

మాట్లాడలేదు చైనీస్ అధికారి.

''గెట్ డవున్ ఐసే'' అరిచాడు కపాడియా మెషిన్‌గన్ బారల్‌ని అతని డొక్కల్లో పొడుస్తూ.

క్రిందకు దిగాడు ప్రత్యర్థి బిక్కుబిక్కు మంటున్న గుండెలతో.

''నీ ర్యాంక్ ?'' ఉరిమాడు భరత్ కపాడియా.

"రెజిమెంట్ మేజర్. మేజర్ చువో నా పేరు" నూతి లోంచి వచ్చినట్లుంది అతని కంఠస్వరం.

"ఎన్ని బెటాలియన్స్ ఉన్నాయ్ నీ రెజిమెంటులో ?"

"మూడు ఉండేవి. రెండు బెటాలియన్ల సైనికులను చంపేసారు మీ భారత సిపాయిలు''

చాచిపెట్టి కొట్టాడు కపాడియా అతని చెంపమీద.

"య్యూ బాస్టర్డ్ ! దురాక్రమణచేసి రెచ్చగొట్టింది మీరు. మిమ్మల్ని క్రైమూ చెయ్యాలి అసలు ! భారత సైనికులకు మానవత్వం ఏడ్వబట్టే ఇంకా దేకుతున్నారు మీరు ఈ అడవుల్లో"

మాట్లాడలేదు మేజర్ చువో.

"జీప్ మీద షెర్లు కొడుతున్నావ్ ! ఇక్కడ రోడ్‌లు వేయించేంది ఎవరు ?"

చెప్పడానికి సంశయించాడు చువో.

''నీకు చెవుడు లేదనుకుంటాను. ఉంటే గూబమీద కొడితే పోతుంది."

"మీ భారతసైనికులు కొంతమంది మాకు బందీలుగా చిక్కారు. వారిచేత వేయించాం ఈ టెంపరరీ రోడ్స్..."

కోపంతో పెట్రేగిపోయాడు భరత్ కపాడియా.

''యుద్ధ ఖైదీలని ట్రీట్‌చేసే విధానం అదేనా ?'' చువో ఎడమకంటి క్రింది చర్మాన్ని రెండువేళ్ళ మధ్యా ఇరికించుకొని గట్టిగా నలిపాడు.

కెవ్వుమన్నాడు చువో ''ప్లీజ్ ! నన్నొదులు''

"తిండి సరిగ్గా పెడుతున్నారా మా వాళ్ళకి ? నిజం చెప్పు"

''ముష్టిలో పీరముష్టిఅన్నట్లుంది. మాకే రేషన్స్ సరిగా అందడంలేదు.''

"ఎక్కడ నీ స్థావరం ?"

"........."

మోకాలు మడిచి గడ్డంమీద తన్నాడు కపాడియా. వెనక్కి తులిపడ్డాడు చావో.

"కదలక. ఎల్ ఎం జి. లో 500 గుళ్ళు ఉంటాయ్''

వంకరపోయిన గడ్డాన్ని సర్దుకున్నాడు చావో.

"క్విక్. ఎక్కడ నీ స్థావరం?"

తెగించాడు మేజర్ చావో. "చెప్తాను" భయపడుతున్నట్లు నటిస్తూ బూటుకాలు మెషిన్‌గన్ వైపు విసిరాడు.

దూరంగా ఎగిరిపడింది LMG. విజయ గర్వంతో అటు వైపు పరిగెత్తబోయాడు చావో. అంతే! బోర్లాపడ్డాడు కపాడియా వేసిన లెగ్ బ్రేక్‌కి.

"అస్తమాను ఆయుధాలు పట్టుకొంటే బోరుగా ఉంది. కాస్సేపు ముష్టియుద్ధం చేద్దాం.'' అంటూ కపాడియా అతని గడ్డంమీద మరో రాకెట్ ప్రేల్చాడు.

చావో స్ప్రింగ్‌లా పైకిలేచి రెండు చేతుల చాకుల్లా పెట్టాడు జుడో ఫోజులో.

మెడమీద పడింది చావో కొట్టిన దెబ్బ. అయితే పడవల్సిన చోట పడలేదు. లేకపోతే కపాడియా స్పృహ తప్పవల్సిందే.

కపాడియా తల 'ఝుం' అంది. వెంటనే తేరుకొని అర చేయి సాచి అతని ముఖంమీద గుద్దాడు. చావో ముక్కు లోంచి రక్తం బుసబుస పొంగింది. చేతి కంటిన రక్తాన్ని చూసి వెర్రెక్కిపోయాడు చావో.

మళ్ళీ చెయ్యి విసరబోయాడు కసిగా. అతని చెయ్యి తటాలున పట్టుకొని కరెపుల్లలా వెనక్కి విరిచాడు కపాడియా. కదల్లేకపోయాడు చావో. బాధగా అరిచాడు.

కపాడియా అతని కాలర్‌లోకి పోనిచ్చాడు తన చేతిని.

ట్రెపీజియమ్ మధ్యగా ఉన్న ఓ నరాన్ని అందుకొని కట్ చేసాడు. అంత ఎత్తు ఎగిరిపడ్డాడు చావో. అసలు బాధ అంటే ఏమిటో అప్పుడే తెల్సింది అతనికి. చావో కుడి చెయ్యి ఇప్పుడు అతని ఆధీనంలో లేదు. ఎండి పోయిన తోటకూర కాడలా వ్రేలాడుతోంది అది.

చెయ్యి చూసుకుని 'బేర్'మన్నాడు చావో. రెండు చేతులు వెనక్కి విరిచి అతన్ని ఓ చెట్టుకు కట్టాడు కపాడియా. అతని గడ్డం పైకెత్తాడు కపాడియా.

"నీ దగ్గర చచ్చినా భారతీయ పద్ధతులు ఉపయోగించను. ఇంకా మంచి టార్చరింగ్ మెథడ్స్ ఉన్నాయ్ నాదగ్గర. రెండవ ప్రపంచ యుద్ధంలో జర్మని సైనికులు విదేశ గూఢచారులను బంధించి, వాళ్ళ పాదాల అడుగున ఉన్న చర్మాన్ని కత్తితో ఒలిచేసి, ముళ్ళకంపల్లో నడిపిస్తూ రహస్యాలు కక్కించేవారట. టెలిగ్రాఫిక్ సిగ్నల్స్ ద్వారా రహస్య సమాచారాలు పంపే సిపాయిల్ని కట్టేసి గోళ్ళ మధ్యఉండే చర్మంలో విషపూరితమైన గుండు సూదులు మెత్తగా గుచ్చేవారట. రెండు రోజుల కల్లా, వ్రేళ్ళన్నీ ఇంచక్కా రసీ, చీము, కట్టి ఒక్కొక్క వ్రేలు నిమ్మకాయంత ఉబ్బేదట. తరువాత ఆ వ్రేళ్ళని టేబుల్‌మీద పెట్టి రివాల్వర్ మడతతో చితక బాదుతుంటే ఒక్కొక్క దెబ్బకి ఒక్కొక్క దేవుడు దిగివచ్చి లైనులో నిలబడే వారట. ఆ లైపు సన్మానం చెయ్యబోతున్నాను నీకు."

అప్పటికే సగం ప్రాణాలు పైకెగిరి పోయాయ్ చావోకి. వినడానికే డోకొచ్చే విధానం అది.

"చెప్తాను" అన్నాడు హీన స్వరంతో.

"జల్దీ. లేకపోతే నాకిట్‌లోని ఇన్‌స్ట్రుమెంట్ బాక్స్

బయటికి దూకుతుంది."

మేజర్ చావో పెదవులు కదిపాడు.

# 11

"నువ్వు చెప్పిందంతా నిజమేనా?"

సమాధానంగా "అబ్బా... !" అంటూ మూల్గాడు చావో. కళ్ళు నీరసంగా వాల్చేపాడు. అతని ముఖం చకచకా కళా విహీనమౌతోంది.

"మిస్టర్ చావో! వాట్ హాపెన్డ్? వాట్స్ ది రాంగ్ విత్ యూ?" అయోమయంగా ప్రశ్నించాడు కపాడియా, అతని చెంపలు తడుతూ.

ఏదో చెప్పడానికి నోరు తెరిచాడు చావో. అయితే మాటలకంటే ముందుగా నురగలు వచ్చాయ్ అతని నోట్లోంచి.

ఆరిపోయేముందు గప్పున వెలిగే దీపంలా. లేని ఓపిక తెచ్చుకొని చెట్టుకొమ్మవైపు సైగచేసాడు చావో. అతని దేహం నల్లగా కమిలిపోతోంది. అదేదో కెమికల్ రియాక్షన్‌లా. తలవాల్చేసాడు చావో.

చావో సైగచేసిన వైపుచూసాడు కపాడియా. పొడుగాటి పాము !! గర్వంగా మెడసాచి కొమ్మలపోంచి జర జరా పాక్కుంటూ వెళ్ళిపోతోంది. దానివైపు గురిచూసి టప టపా కుల్చాడు కపాడియా.

పాము తల ముక్కలయ్యింది. 'దబ్' మంటూ పడింది నేలమీద. తోకలో ఇంకా ప్రాణం ఉండడంవల్ల కాస్సేపు ఎగిరెగిరి గంతులేసింది అస్తవ్యస్తంగా.

దాని వద్దకు నడిచి పరీక్షగా చూసాడు కపాడియా. వెంటనే నీఫా అడవుల్లోఉండే టింకెట్ స్నేక్, బాండెడ్

క్రెయిట్, బాండూ పిట్ వైపర్ మొదలైన పాముల గురించి తాను చదివిన ఎన్‌సైక్లోపీడియాలోని విశేషాలు జ్ఞాపకం వచ్చాయి.

అది 'బంగారస్ ఫాసియేటస్' ఫామిలీకి చెందిన బాండెడ్ క్రెయిట్ అనే విషసర్పం. షుమారు 1700 మిల్లీమీటర్ల పొడవుంటుంది. అది ఆడసర్పమై ఉండాలి. మగపాములు అంతకంటే పొడవుంటాయ్. పసుపురంగు శరీరం మీద నల్లటి అడ్డచారలున్నాయ్. వేరుబడ్డ తలలోంచి కళ్ళు, గోల్డ్ కలర్‌లో మెరుస్తున్నాయ్. వర్షపు జల్లులు పడినతర్వాత ఈ పాములు ఎక్కువగా కనబడతాయి.

కపాడియా కాస్సేపు చావో మృతదేహాన్ని నిశితంగా చూస్తూ ఆలోచించాడు. క్రింది పెదవిని మునిపంటితో కొరుక్కున్నాడు అలవాటుగా.

తల పంకించి కిట్ వైపు నడిచాడు. ఆతని చేతిలోకి చిన్న పెట్టి వచ్చింది. అందులో క్రేప్ హెయిర్, నల్లటి పెన్సిలు ఉన్నాయి. హాండ్‌మిర్రర్‌లో తనమొహం చూసుకొంటూ గబగబా వేషం మార్చుకోసాగాడు కపాడియా. చావో శరీరానికి ఉన్న ఊలుకోటు. పాంటు తాను ధరించాడు. అయిదు నిమిషాలో అతని వేషం పూర్తిగా మారిపోయింది ఏరియా కమాండర్ భరత్ కపాడియా ఉరఫ్ మేజర్ చవో, తాను నేర్చిన థోడా థోడా చైనీస్ భాషను మననం చేసుకొంటూ, జీప్ వైపు నడిచాడు హుందాగా.

# 12

"ఎవరక్కడ?" అరిచాడు సెంట్రీ టార్చిలైట్ కాంతిని కపాడియా ముఖంమీద వేస్తూ.

"య్యూ బ్లడీ రాస్కెల్! మందుమీదున్నట్లున్నావ్!

టార్చి ఆర్పు. నిన్ను పీకింగ్ జైల్‌కి పంపితేగాని ఒళ్ళు నీ కంట్రోల్లో ఉండదు." కీచుమన్నాడు కపాడియా.

వణికిపోయాడు సెంట్రీ. "ప్లీజ్ ఫర్ గివ్ మి మేజర్ !" అన్నాడు చెయ్యి చాకులామడిచి రకాల్న శాల్యూట్ చేస్తూ.

అతనికేసి ఛీత్కారంగా చూసాడు కపాడియా. "ఊఁ! జీపు లోపలపెట్టు" అంటూ గుడారంవైపు నడిచాడు

'మృత్యుగహ్వారంలోకి నడుస్తున్నాను' అనుకున్నాడు కపాడియా. గుండెదడను కంట్రోల్ చేసుకొంటున్నాడు. మారువేషాల గురించి పుస్తకాల్లో చదవడమేగాని, తనకు నిజజీవితంలో ఆ అవసరం ఇప్పటివరకూ కలుగలేదు. తనకు వేషాలు వెయ్యడంలో అనుభవంలేదు. ఏమాత్రం తప్పటడుగు వేసినా శత్రువులు నిర్దాక్షిణ్యంగా కాల్చి పడేస్తారు.

గుడారం ముందున్న సెంట్రీ శాల్యూట్‌తో తేరుకొన్నాడు కపాడియా.

"లోపల బిజీగా ఉంటాను. అనుమతి లేకుండా ఎవర్ని లోపలకి రానివ్వకు" ఆర్డర్ జారీచేసి లోపలికి నడిచాడు.

గది మధ్యగా నిలబడి ఓసారి చుట్టూ పరీక్షించాడు కపాడియా. ఓ టేబుల్, దానిమీద మావో భగవద్గీత, టేబుల్‌కి ఎదురుగా ఓ కుర్చీ, ఒకవారగా చెక్కలతో చేసిన పడక, దానిమీద పరుపుకి బదులుగా సైన్యంలో ఉపయోగించే గ్రౌండ్‌షీట్ పరచబడి ఉంది. తలగడస్థానంలో మడత పెట్టబడ్డ వులెన్‌రగ్గు ఉంది. మరోమూల చిన్నస్టవ్, దాని ప్రక్కగా టీ'కెటిల్. రాటకు వ్రేలాడుతోంది ఓ హరికెన్ లాంతరు.

మసిబారిన స్టౌలో అగ్గిపుల్ల వేసి టీ'కెటిల్ దానిమీద

పెట్టాడు కపాడియా. కొంతసేపటికి వెచ్చబడింది. అది బ్లాక్ టీ. పాలు కలుపనిది.

టీ సిప్‌చేస్తూ టేబుల్‌ముందు కుర్చీలో కూర్చొన్నాడు కపాడియా. టేబుల్‌సొరుగు అతన్ని ఆకర్షించింది. లాగాడు. ఏవో కాగితాలు కనబడ్డాయి. చకచకా వాటిని పరిశీలించాడు.

అరగంట గడిచింది. బయట ఏదో గొడవ వినబడ్డంతో సొరుగుమూసి అటువైపు చూసాడు కపాడియా.

"నీ కళ్ళు నెత్తికెక్కాయి. లేకపోతే నన్ను లోపలికి వెళ్ళకుండా అటకాయించడానికి నీకెన్ని గుండెలు? ఉండు మా డార్లింగ్‌తో చెప్పి నీ చర్మం ఒలిపిస్తాను."

విస్తుపోయాడు కపాడియా. అమె చైనీస్ స్త్రీ. బహుశ చావో ఉంపుడుగత్తె అయివుండాలి. మైగాడ్! రణరంగంలో ఉంపుడుగత్తెను తెచ్చుకోగలిగాడా చావో? బహుశా తన క్రింద సైనికులను కాకాపట్టి, అధికారుల కనుగప్పి మగాడి వేషంలో తీసుకువచ్చి ఉంటాలి!

"క్షమించాలి మేడమ్. ఆర్డర్ ఈజ్ ఆర్డర్. అయ్యగారు మిమ్మల్ని లోపలికిపంపితే నన్ను షూట్ చేస్తారు."

"సెంట్రీ: యూ ఫూల్! నా డార్లింగ్‌నే ఎదిరిస్తున్నావా? ఆమెను అర్జంటుగా లోపలకు పంపు." గర్జించాడు కపాడియా కుర్చీ, బుర్రున వెనక్కి జరిపి పైకిలేస్తూ.

చైనీస్ యువతి విజయగర్వంతో పరుగు పరుగున లోపలికి వచ్చి కపాడియాని పెనవేసుకొంది.

"ఓహ్! చావో డియర్! మన కాంపస్‌కి రాగానే నా టెంట్‌లోకి దూసుకు వచ్చేవాడివి ప్రతిరోజు!" అతని ఛాతీ మీద పిడికిళ్ళతో గుద్దుదూ ఆరోపించింది చైనీస్ యువతి.

ఉలిక్కిపడ్డాడు కపాడియా. తనకేం తెలుసు ఆ ప్రబుదు

దికి ఓ కీప్ ఉన్నట్లు ?...అయినా తాను తేలిపోకూడదు. తనకుతానే ధైర్యం చెప్పుకొన్నాడు భరత్.

ఆమె అరచేతిని ముద్దుపెట్టుకొని అన్నాడు.

"క్షమించు డార్లింగ్ ! బుర్ర పాడైపోయింది నేను తీసు కెళ్ళిన పటాలమంతా జంగ్ నౌరానంగ్ వంతెన దగ్గిర చచ్చారు."

"డోంట్ వర్రీ డియర్ ! నీ అలసట తీర్చడానికి నే నున్నానుగా!" అంటూ కాట్‌మీదకి లాగింది కపాడియాని. అతని ప్రక్కనే పడుకొంది అతన్ని లతలా పెనవేసుకొని.

'ఇదెక్కడి ఖర్మరా బాబూ!' అనుకున్నాడు కపాడియా. తన శరీరంమీద తేళ్ళు పాకుతున్నట్లుంది అతనికి

అతని కణతలు తన బొటనవ్రేళ్ళతో సున్నితంగా రుద్దింది చైనీస్ యువతి. 'ఎలావుంది డియర్?' గొణిగింది

'పిచ్చి ప్రశ్న డార్లింగ్, నీ ఒళ్ళు తగిలితే షాంపైన్‌కంటే ఎక్కువ నిషా ఇస్తుంది' అన్నాడు కళ్ళు తేలవేసి కపాడియా. గర్వంగా చూసింది చైనీస్ యువతి. "అయితే ఇంకా ఆలస్యం ఎందుకు డియర్! కమాన్" అతని కుడిచెవి సున్నితంగా కొరుకుతూ మత్తుగా గొణిగింది.

"చచ్చాన్రా బాబూ!" అనుకున్నాడు కపాడియా అతని గుండెలు దడదడలాడాయి. మెదడులో ఆలోచనలు, తూనీ ల్లాగా రొదపెట్టసాగాయి;

'ఎలా ? ఆమెతో రతి ప్రారంభిస్తే తన గౌప్యం తాను తప్పుకున్నట్లవుతుంది. రోజూ అలవాటైన చావోకి, తనకీ సృష్టికార్యంలో డిఫరెన్స్ కనిపెట్టడం ఓ స్త్రీకి పెద్ద ప్రాబ్లమ్ కాదు."

"ఎలా ? తను ఏదో చెయ్యాలి. లేకపోతే అనుమానం

వస్తుందామెకు."

కపాడియా ఆమ మెడమీద చిన్నగా ముద్దుపెట్టాడు. ఆమె స్కర్ట్ పక్కకి తొలగించి వక్షోజాలమధ్య ముఖంతో రుద్దుతూ, ఓచేతిని పొత్తికడుపుమీద వేసి, నిమిరాడు.

షాక్ కొట్టినట్లయింది చైనీస్ యువతికి.

"ఎవరు నువ్వు?" కంగారుగా లేచింది ఆమె.

గుండె ఆగినట్లనిపించింది కపాడియాకి అయిపోయింది. తన పని అవుట్. ఏదో క్లూ దొరికిపోయిందామెకు.

చటుక్కున ఆమె మెడచుట్టూ తన చేతిని బిగించాడు కపాడియా. "చావో చచ్చాడు నేను ఏరియా కమాండర్ కపాడియాని.

గట్టిగా అరుస్తే నీ కంఠాన్ని రెండు వ్రేళ్ళతో నొక్కి చంపగలను."

'ఎలా కనిపెట్టగలిగావ్ నేను చావోని కాదని?'

నవ్వింది చైనీస్ యువతి. "చావో ఎప్పుడూ ఇంతగా నన్ను కవ్వెక్కించలేదు. 'దడిలోనా ఒడిలోనా అన్నంత కంగారుగా ప్రవర్తించేవాడు. పైగా చావోకి ఇవి లేవు" అంది చైనీస్ యువతి, కపాడియా ఛాతిపై వెంట్రుకలు ప్రేమగా నిమురుతూ.

ఆమె మాటలు పచ్చిగా తోచాయి కపాడియాకి.

'మిస్టర్ కపాడియా! నీ లాలనలో ఎంతో మాధుర్యముంది. ప్లీజ్. ఒక్కసారి...' అంటూ అతని మెడచుట్టూ చేతులు వేసి మీదకి లాక్కుంది.

"ఇంతదాకా వచ్చినందుకే బాధపడుతున్నాను. నిజంగా నీమీద నాకు మనసులేదు" ఆమె చేతులు సున్నితంగా విడిపించుకుంటూ అన్నాడు.

విచ్చిగా తలఊపింది చైనీస్ యువతి మారాంచేస్తున్న ట్లుగా. 'కపాడియా! ప్లీజ్! ఒక్కసారి! తర్వాత నన్ను నీ చేతులతో చంపెయ్!' జాలిగా చూస్తూ అడిగింది.

నిర్విణ్ణుడయ్యాడు కపాడియా. స్త్రీతత్వం ప్రపంచమంతా ఒకటేనా! అనిపించింది అతనికి

కపాడియా తల కొంచెం వంచాడు. తన పెదిమలని, ఆమె పెదిమలపై తేలికగా రాశాడు. అందులో ఆవేశం, వాంఛ లేవు; జాలి, అనురాగం ఉన్నాయి.

'డియర్!' మామూలుగా పిల్చాడు కపాడియా. 'చావో ఆత్మకి అశాంతి కల్గించే పని మనం చెయ్యకూడదు. నీవు 24 గంటలు నిద్రపోతావ్. భారత సైనికులు నిన్ను గౌర వంగా చూస్తారు. యుద్ధం త్వరలో పూర్తవుతుంది. నువ్వు నీదేశం వెడతావ్. వీలైతే నన్ను క్షమించు' అంటూ ఆమె మెడవద్ద ఏదో నరం నొక్కాడు కపాడియా.

స్పృహతప్పి పడిపోయింది చైనీస్ యువతి.

తల విదిలించి గుడారంబయటికి నడిచాడు కపాడియా పెద్దపెద్ద అంగలువేసుకుంటూ.

# 13

రేడియం డయల్ వాచీ చూసుకున్నాడు కపాడియా. పది గంటల రెండు నిముషాలైంది.

"సెంట్రీ! C. O. ఎక్కడ?" అర్చాడు కపాడియా.

'పిలుస్తా సార్!'

రెండు నిముషాల్లో బెటాలియన్ కమాండింగ్ ఆఫీసర్‌ని వెంటబెట్టుకొని వచ్చారు.

'గుడ్ ఈవెనింగ్ సర్!' అన్నాడు సి.ఓ సెల్యూట్‌చేసి.

'దొంగపడిన ఆర్నెల్లకి కుక్క మొరిగినట్లు ఇప్పుడా విష్

చెయ్యడం?'

'క్షమించాలి సర్! ఇంతకుముందే పలకరిద్దామనుకున్నాను. మీరు మేడమ్‌గారితో మాట్లాడు...

'ఇట్సాల్ రైట్! ఇట్సాల్ రైట్! మన సైనికులు పిరికి పందల్లా వ్యవహరించి ప్రాణాలు తీసుకున్నారు. తెల్లవారు ఝామునకల్లా మీ బెటాలియన్ సిద్ధంచెయ్యండి. ఎలాగైనా ఆ వంతెనను మనం వశపర్చుకోవాలి.''

"యువర్ ఆర్డర్‌సర్" వినయంగా అన్నాడు సి ఓ.

''నేను ఓసారి యుద్ధఖైదీలను చూడాలి"

"మీరు ఎన్నిసార్లు బెదిరించినా వాళ్ళు తమ రహస్యాలు చెప్పడంలేదు ఏంలాభం సార్?"

"షటప్, దట్ ఈజ్ నన్ ఆఫ్ యువర్ బిజినెస్" కళ్ళల్లోంచి చింతనిప్పులు కక్కాడు కపాడియా.

"రైట్ సార్. నా వెంటరండి."

X X X

అది చెక్కలతో నిర్మింపబడ్డ గృహం. తాళంతీసాడు సి.ఓ.

"నీవు వెళ్ళొచ్చు. వెపన్స్ క్లీన్‌చేయించి థర్డ్ బెటాలియన్ని మార్చింగ్‌కి రెడీ చెయ్యడం మర్చిపోకు."

తలఊపి శాల్యూట్ చేసి వెళ్ళిపోయాడు సి ఓ.

తలుపుతీసి లోపలికి నడిచాడు భరత్ కపాడియా,

ఓసారి చుట్టూ పరికించాడు. కొయ్యస్తంబాలకు లాంతర్లు వ్రేలాడుతున్నాయ్.

వివిధ వర్గాలకు చెందిన సుమారు పాతికమంది భారత జవానులు తలలు వంచి కూర్చున్నారు.

వారికాళ్ళు కొయ్యరాటలకు గొలుసులతో కట్టి వేయబడి

ఉన్నాయ్ నేలమీద అక్కడక్కడా రక్తపు మరకలు.

"మిస్టర్ చావో : నిన్ను చూస్తే జాలేస్తోంది. నువ్వెన్ని చిత్రహింసలు పెట్టినా మా నోటినుండి "జై భారత్!" అనే నినాదంతప్ప మరోటి వెలువడదు. డోన్ట్ వేస్ట్ యువర్ టైం 'అన్డ్ ఎనర్జీ' తలపైకెత్తి అన్నాడు ఓ జవాను.

అలాంటి పరిస్థితిలో చావో ఉంటే ఈపాటికి బూటు కాలితో ఆ సైనికుడి ముఖం పచ్చడిచేసి ఉండేవాడు.

అతనివైపు నడిచాడు కపాడియా. "జై భారత్! అంతిమ విజయం భారతీయులదే" అన్నాడు నెమ్మదిగా.

అందరు విచిత్రంగా చూసారు అతనికేసి.

"ఫ్రెండ్స్! నేను చైనీస్ మేజర్ చోవోని కాదు. అతని వేషంలో ఉన్న ఏరియా కమాండర్ కపాడియాని." తన ఐడెంటి ఫికేషన్ గాల్లోకి ఎత్తి చూపించాడు కపాడియా.

అందరూ సర్దుకొని కూర్చొని టకాటకా శాల్యూట్ చేసారు.

"వెల్ మైడియర్ ఫ్రండ్స్! మీరు తెల్లవారే లోపున స్వేచ్ఛ పొందుతారు. మిమ్మల్ని విడిపించి నేను ముఖ్యమైన పనిమీద టాంగ్‌పాంగ్లా వైపు జీపులో వెడతాను శత్రువులు ఉదయం తాగే టీలో మత్తుమందు కలుపబడుతుంది. మీలో కొందరు జంగ్ నౌరానంగ్ వంతెన రక్షణ భారం తీసు కోవాలి. మిగతా ఇక్కడి సైనికులపని... అంటూ ఏదో చెప్ప సాగాడు కపాడియా.

## 14

కొండల్లో, కోనల్లో. పరిగెడుతోంది కపాడియా ఎక్కిన జీప్.

అప్పటికి ఓ గంట ప్రయాణించాడు కపాడియా. అతడి ఉక్కు హస్తాల్లో చిక్కుకున్న స్టీరింగ్ వీల్ అటూ ఇటూ

అస్తవ్యస్తంగా తిరుగుతోంది. బ్రేకులు కీచుగా అరుస్తున్నాయ్ ఒక్కోసారి.

భారత సైనికులకి విమోచన కల్గించి కపాడియా టాంగ్ పాంగ్లా వైపు ప్రయాణం చేస్తున్నాడు. విమోచన పొందిన సైనికులు అక్కడి సైనికపటాలాన్ని రూపుమాపి వుంటారు యీపాటికి. ఒళ్లో ఉన్న మాప్ చూచుకొంటున్నాడు కపాడియా అప్పుడప్పుడు మాప్ చూసుకుంటూ జీప్ నడపడం దుర్భరంగా ఉంది అయినా తప్పదు.

జీప్ ముందు చక్రాలు ఓ ఎత్తయిన గుట ఎక్కాయి. గుట్టమీద ఉన్న రాళ్ళు జరజరా జారాయి.

అదిరి పడ్డాడు కపాడియా. టైర్ స్లిప్ అయింది. జీప్ని కుడిప్రక్కకు కోద్దామను కొన్నాడు. కాని అప్పటికే ఆలస్యం అయింది. జీప్ ఎడం ప్రక్కకు వాలి దడదడా దొర్లింది పల్లంలోకి.

చివరి సారిగా తనకున్న ఒకేఒక ఆస్తి - కన్నతల్లినీ, తర్వాత భగవంతుణ్ణీ ధ్యానించాడు కపాడియా.

పెట్రోల్ టాంకులో ఫ్రిక్షన్ పుట్టి 'భగ్'మని మండింది అది నా డ్యూటీ అన్నట్లుగా.

తిరిగి కళ్ళుతెరిచి చూసేసరికి తాను తలక్రిందులుగా ఓ చెట్టుకొమ్మకి వ్రేలాడగట్టబడినట్లు తెల్సుకొన్నాడుకపాడియా.

మోచేతివద్ద గాయాలు, గాలికి ఆరి పెచ్చుకడుతున్నాయ్.

ఒళ్ళంతా రోకలితో దంపుతున్నట్లు ఒకటే నొప్పి. అదే ఇంకో పరిస్థితిలో అయితే తాను అలా తలక్రిందులుగా ఎంతసేపైనా ఉండగలడు. తనకు శీర్షాసనం బాగా అలవాటు.

అయితే రొంపచెయ్యడంవల్ల తలక్రిందులుగా వ్రేలాడుతూ ఊపిరితీసుకోడం అసాధ్యంగా ఉంది. నోటితో పీలుస్తు

న్నాడు గాలి. బుర్ర బరువెక్కింది. శరీరాన్నే తాళ్ళకు వ్రేళ్ళాడదీయడం వల్ల కాళ్ళు ఒరుసుకుపోతున్నాయి.

ఎవరు తనను ఆక్సిడెంట్ నుంచి రక్షించింది? రక్షించిన వాళ్ళు తనను చెట్టుకు ఎందుకు కట్టేస్తారు?

మెల్లగా తలతిప్పి పరిసరాలు గమనించాడు కపాడియా. తనకు అటు, ఇటు హారిజాంటల్‌గా ఉన్నాయి చెట్లు. వాటి కొమ్మలకి తనలాగే వ్రేలాడుతూ కనబడ్డారు కొంతమంది చైనీస్ సైనికులు. అయితే వారి గుండెల్లో బాణాలు దిగబడి ఉన్నాయ్. ఎదురుగా చూసాడు కపాడియా.

ఓ అందమైన కొండజాతి యువతి విల్లంబులను చేత ధరించి తనకు గురిపెట్టి నవ్వుతోంది.

పచ్చటి శరీరచ్ఛాయ, గుండ్రటిముఖం, వాడియైన చిన్న కళ్ళు, కొంచెం ఫ్లాట్‌గా ఉన్న ముక్కు, లక్క పిడతలాంటి నోరు, నవ్వినపుడు పైకి ఉబికే బుగ్గలు, ముత్యాల్లాంటి పలువరుస. చిన్న గడ్డం. జుట్టు వెనక్కి పీరటోసుకొని, తలకి అడ్డంగా ఎఱ్ఱటి రిబ్బన్ కట్టుకొంది. రంగు రంగుల గుడ్డముక్కలు అతికించి కుట్టినట్లున్న దుస్తులు. చిన్నగా ముడతలు పడిఉన్న సున్నితమైన కంఠానికి ఆకాశంరంగు పూసలదండ.

కాసేపు తనబాధను మర్చిపోయి ఆమెవైపు కళ్ళార్పకుండా చూసాడు కపాడియా.

వీనస్, హెలెన్ ఆఫ్ ట్రాయ్‌లను, ఆ కొండజాతి యువతి సహజ సౌందర్యం ముందు నిలబెట్టి, జల్లకొట్టాలని పించింది కపాడియాకి. తన పిచ్చి ఆలోచనలకు నవ్వుకున్నాడు కపాడియా.

ఆమె తన దగ్గరగా వచ్చింది. పూలరధం నడుస్తున్నట్లు

అనిపించింది.

ఆమె వెనుక ఉన్న కొండజాతి యువకులు రౌద్రంగా తనవైపే చూస్తున్నారు.

"చమేలీ! ఆలస్యమెందుకు? చంపెయ్!" అర్చాడు ఓ కొండజాతి యువకుడు వంకరటింకర హిందీలో.

అతని మాటలను బట్టి ఆమె పేరు చమేలీ అనుకున్నాడు కపాడియా. అతనిక్కి సమాధానంచెప్పలేదు చమేలి. ''చైనీస్ ఆఫీసర్ గారికి మెలకువ వచ్చిందనుకుంటాను ఇప్పటికి 99 మంది చైనా పిశాచాలు నాబాణాలకు గురిఅయ్యారు. నువ్వు వందోవాడివి.'' అంది గర్వంగా

కపాడియాని ఎవరో ఛెళ్ళున చరిచినట్టయింది. అప్పటి గాని గుర్తుకురాలేదు తాను ఇంకా చైనీస్ మేజర్ వేషంలో ఉన్నానని.

చిన్నగా నవ్వాడు కపాడియా "చమేలీ నీ చేతులంలో చచ్చిపోవడానికి చాల అదృష్టం ఉండాలి. కాని నేను చైనీస్ అధికారిని కాదు, అంటూ తనగురించి చెప్పాడు కపాడియా.

''తప్పించుకోడానికి ప్రయత్నం చేస్తున్నావ్?" అంది చమేలి అనుమానంగా

"చమేలీ! కానీని, వేడినీళ్ళు తెప్పించు. నా మారువేషం తీసి అసలు స్వరూపం చూపిస్తాను ఇంతమంది కొండజాతి యువకుల్ని తప్పించుకొని నిరాయుధుడిగా పారిపోగల నను కోవడం ఎంత అవివేకమో నాకు తెల్సు!"

"అప్పటికీ నువ్వు నమ్మకపోతే, భారతీయ పౌరురాలిగా నీకు కొన్ని బాధ్యతలు అప్పగించి నీపాదాలముందు హాయిగా ప్రాణాలు విడుస్తాను. సరేనా!" అన్నాడు భారంగానవ్వుతూ భారత్.

అతని ధైర్యానికి చకితురాలైంది చమేలి.

చావుల చదరంగంలో నిలబడి, తన అనుభవంలోని చైనీయులెవరూ అంత ధైర్యంగా మాట్లడలేదు.

'సబాటా!" అంటూ అంతకుముందు కపాడియాని చంపెయ్యమని అరిచిన యువకుణ్ణి పిల్చి, ఏదోచెప్పింది.

సబాటా మొఖం బిగ్గించి ఏవో ఎదురు ప్రశ్నలువేసాడు. అతనికేసి కోపంగా చూసింది చమేలి. అతడు అయిష్టంగా చెట్టెక్కి మొలకున్న కత్తితో కట్లుతెంపాడు. కపాడియా క్రింద పడిపోకుండా పట్టుకొంది చమేలి.

అయిదు నిమిషాల్లో అక్కడికి ఓ మట్టిపాత్రలో వేడినీళ్ళు వచ్చాయి.

కమాండర్ కపాడియా వాటితో ముఖం కడుక్కున్నాడు మేకప్ చెరిగింది. నుదుటిమీద మరికొన్ని నీళ్ళతో తడిపాడు. విగ్ చివర్లకున్న గమ్ కరిగిపోయింది. తలమీద అమర్చిన చంపపిన్నులు లాగేసాడు.

కొండజాతిస్త్రీలు, యువకులు అదేదో ఇంద్రజాలంలా చూస్తున్నారు అతనివైపు. అరటిపండ్లు వొల్చినట్లు తీసాడు విగ్గుని, కపాడియా. రొయ్యమీసాలు పీకేసి నవ్వుతూ చమేలివైపు చూసాడు. అది నవ్వుకాదు సమ్మోహనాస్త్రం.

చమేలి రెప్పవేయడం ఎప్పుడో మర్చిపోయింది.

గంభీరమైన ముఖం, ఒత్తుగా పెరిగిన నల్లని వంకీలజుట్టు, విశాలమైన నుదురు, గుబురైన కనుబొమ్మలు, అటుఅమాయకత్వం, ఇటు తీక్షణత్వం చూపించగలిగిన కళ్ళు, దృఢమైన ముక్కు, కోరమీసం, బిగించినట్లుండే పెదిమలు, నిండైన బుగ్గలు, పొడుగాటి సైడ్‌బర్న్స్, కొంచెం క్రిందుగా వెడితే విశాలమైన ఛాతీ, పొంటుతన్నుకువచ్చే బలమైన తొడలు"

సిగ్గుపడిపోయింది చమేలి.

ప్రక్కగా ఉన్న సబాటా మొలలోని కత్తిని చటుక్కున లాక్కున్నాడు కపాడియా.

"ఏం చమేలీ! నమ్మలేక పోతున్నావా? భారత సైనికాధికారి నిజాయితీని పరీక్షిస్తావా? అయితే నేను ప్రాణాలు అర్పించడానికి సిద్ధం" అన్నాడు కత్తిపిడి ఆమెచేతికిస్తూ.

కత్తిని లాక్కుని దూరంగా విసిరేసింది చమేలి

ఆమె కళ్లలో నీళ్ళు గిర్రున తిరిగాయి. "చాల అపచారం చేసాను. నన్ను క్షమించండి కమాండర్‌సాబ్!" అంటూ గబాలున అతని పాదాలమీదకు వాలిపోయింది కొండజాతి కన్య చమేలి.

# 15

ఓనులతమంచంమీద బోర్లాపడుకొని ఉన్నాడుకపాడియా. అది వెదురు కర్రలతో కట్టబడి గంగులు వేయబడ్డ పొదరిల్లు. చల్లగా ఉంది వాతావరణం. కపాడియా ఒంటిమీద టర్కిష్ డ్రాయర్ తప్ప మరేమీలేవు. ఆజాను బాహు కావడంవల్ల అతని కాళ్ళు మంచందాటి బయటకి వచ్చాయి.

ఓ కొయ్యస్టూలుమీద కూర్చొని చమేలి అతని వీపుకి వేడినీళ్లకాపడం పెడుతోంది. గాయాలకు పసరుపూయబడి ఉంది

"తొలిచూపు 'ప్రేమ'మీద నమ్మకముండేది కాదునాకు. కాని నిన్ను చూసిన తర్వాతనా అభిప్రాయం తప్పనిపిస్తుంది" అన్నాడు కపాడియా ఎటో చూస్తూ.

మాట్లాడలేదు చమేలి.

"చమేలీ ఓనిజం చెప్పనా?" తలగడమీద గడ్డంఆన్చి అన్నాడు కపాడియా.

'ఊఁ!' అంది చమేలి తనపని తానుచేసుకొంటూ.

"నీ కోమలహస్తాలతో నువ్విలా పరిచర్యలు చేస్తుంటే నేను ఇలాగే ప్రాణాలు వదిలేస్తే ఎంత హాయిగా ఉంటుందా అని ఆలోచిస్తున్నాను"

"మిలట్రీవాళ్ళకి కవిత్వం వచ్చని ఇప్పటిదాకా తెలియదు" అంది చమేలి

"తెలివిగా తప్పుకొంటున్నావ్! అన్నట్లు చెప్పడం మరిచాను చమేలీ!

నీపేరు ఎంతబావుందో తెల్సా?"

"ఊహుఁ: అదికూడా తెలపీయండి."

నార్త్ ఇండియాలో కలాఖంద్ అనే స్వీట్‌ని తెగతింటారు. అంతకన్నా తీయగా ఉంది తెల్సా నీ పేరు"

'పేర్లకి ఎక్కడైనా రుచి ఉంటుందా?'

'ఏమో! నాకు తెలియదు. అలా అనిపిస్తోంది నిన్ను పిలిచినప్పుడు.'

'అలాగా' అంటూ చమేలి వేడినీళ్ళ గుడ్డని ఓ గాయం మేద ఎక్కువసేపు ఉంచింది.'

'అమ్మోయ్!' అంటూ అంతెత్తు లేచాడు కపాడియా.

పకపకా నవ్వింది చమేలీ. 'ఇప్పుడెలా అనిపిస్తోంది కమాండర్‌సాబ్?' కొంటెగా చూస్తూ అడిగింది.

కపాడియా కోపంగా, తలగడలో ముఖం దాచుకొన్నాడు.

రెండు నిమిషాల తర్వాత ఓ లేత హస్తం తన జుట్టు నిమురుతూండడం చూసి ఉలిక్కిపడ్డాడు కపాడియా. తల వెనక్కి తిప్పలేదు. ఆ చెయ్యి ఎవరిదో తనకు తెల్సు.

"నన్ను క్షమించు చమేలీ: నీ మనసు తెలుసుకోకుండా తాగినవాడిమల్లే ఏదేదో మాట్లాడాను. నా ప్రవర్తన నాకే

ఆశ్చర్యంగా ఉంది' అన్నాడు మోచేతిమధ్య ముఖం దాచుకొని.

అతనిమీదకు వంగింది చమేలీ. 'భరత్‌బాబూ! ఎందుకు ఈ కొండజాతిదానిమీద మీకింత ప్రేమ?'

చటుక్కున తలతిప్పాడు కపాడియా. 'అంటే...అంటే ...నేనంటే నీ కిష్టమేనా చమేలీ!' ఆవేశంగా ఆమెను హృదయానికి హత్తుకున్నాడు కపాడియా.

ఆమె వేడి నిట్టూర్పులు అతని ఛాతీని కాల్చేస్తున్నాయ్.

'హృదయం ఇచ్చే దేవుడి పాదపూజచెయ్యడానికి ఏ పుష్పం ఒప్పుకోదు భారత్‌బాబూ!' మత్తుగా చూస్తూ అంది చమేలి.

ఆమెబుగ్గలు నిమురుతూ కళ్ళల్లోకి చూసాడు కపాడియా. అతనికీ ప్రపంచాన్ని జయించినంత గర్వంగా ఉంది.

చమేలీ! నువ్వు నిజంగా నాదానివేనా?...కోరనిదే దేవుళ్ళు వరాలిస్తారని ఇప్పటిదాకా నాకు తెలియదు' అన్నాడు కొంటెగా నవ్వుతూ, ఆమె పెదవులపై ముద్దుపెట్టుకొని.

# 16

'దాదా అని 60 ఏళ్ళ వృద్ధుడుండేవాడు. 1962 అక్టోబరులో జరిగిన చైనా భారత యుద్ధంలో గాయపడిన దాదాని కొండజాతి నాయకుడైన మా తండ్రి బోటో రక్షించాడు. అప్పట్నుంచీ మామధ్యే ఉండిపోయాడు దాదా. నన్ను కన్న కూతురులా చూసుకునేవాడు. ఎన్నో విషయాలు నేర్పాడు. ఎక్కువగా హిందీ, కొంచెం ఇంగ్లీష్ అతనివద్దే నేర్చుకున్నాను.

"నాలుగు రోజులక్రితం ఓసారి, కట్టెపుల్లలు తేవడానికి అడవిలోకి వెళ్ళిన దాదా ఎంత సేపటికి రాలేదు. అంతా

వదికాం. చివరికి రక్తసిక్తమయిన శరీరంతో, అంతిమ యాత్రకు సిద్ధంగాఉన్న దాదా కనపడ్డాడు. అందమైన కొండజాతి స్త్రీల ఆచూకీ తెలుపమని అతన్ని హింసించారట చైనీస్ సైనికులు. దాదా ఇక లేడు. నాలో దహిస్తున్న ప్రతీకార వాంఛకు, నేను దాసోహమవడానికి కారణం ఇదే' అంది గంభీరంగా చమేలి

'సారీ! చమేలీ! ఆ విషయాలు జ్ఞాపకంచేసి నిన్ను కలవర పెట్టాను.'

ఏదో లోకంలోంచి ఊడిపడ్డట్టు ఉలిక్కిపడింది చమేలీ!

"ఆఁ! అన్నట్లు మీగురించి చెప్పరేం! ఎన్నో విశేషాలు అడగాలనుకున్నాను!" ముఖంనిండా నవ్వుపులుముకుంటూ అడిగింది.

పాల్‌మాల్ సిగరెట్ వెలిగించాడు కపాడియా. పొగ చిలిపిగా చమేలీ ముఖంమీదకు వదుల్తూ అన్నాడు. 'ఏం చెప్పమంటావ్! మన సైనికులకీ, తద్వారా దేశానికీ ఉపయోగపడే కొన్ని యుద్ధవ్యూహాలు రచించాను. అవి ప్రభుత్వానికి అందించే ఉద్దేశ్యంతో విసుగుచెందని విక్రమార్కుడిలా తిరుగుతున్నాను.'

'ఇంకా మీ పర్సనల్ విషయాలు...' గడ్డంకింద చెయ్యిపెట్టుకొని అడిగింది చమేలి.

ఆమె కళ్ళల్లోకి వింతగా చూశాడు కపాడియా. 'అమ్మో! అమ్మాయిగారికి అపుడే, అటువైపు తిరిగిందన్న మాట మనసు!'

కొంటెగా ఆమె ముక్కు గిల్లాడు కపాడియా. భుజాలెగరేసి 'నాగురించి చెప్పడానికి పెద్ద విశేషాలు లేవు. ఆకాశమంత ప్రతిష్ట, కొండంత డబ్బు ఉన్న చిన్నసైజు కుటుం

బంలో పుట్టాను మా ఫాదర్ శరత్ కపాడియా. ఇండియన్ నేవీకి చెందిన విక్రాంత్ వార్‌షిప్‌లో లెఫ్టినెంట్ కమాండరుగా పనిచేసేవారు. అయితే భారత పాక్ యుద్ధంలో, పాక్ సబ్‌మెరీన్ ఘాజీని డిస్ట్రాయ్‌చేసే ప్రయత్నంలో ప్రాణాల నర్పించారు. డాద్వారా నేడివిగురించిన ఎన్నో విశేషాలు తెల్సుకొన్నాను. ఆయన చివరి కోరిక నేను పదాతిదళాన్ని (Army) రుచి చూడాలనీ. అంతు చూడాలనీ.

కృషిచేసి క్విక్‌ప్రొమోషన్స్ కొట్టాను. నా దృష్టిలో నాకున్న ఆస్తిపాస్తి చల్లని మనసు గల నా మాతృమూర్తి సులోచనాదేవి. బొంబాయిలో ఉంటోంది. నాకోసం కళ్ళల్లో వేయివత్తులు వేసుకొని ఎదురుచూస్తూ, అని మౌనంగా వింటున్న చమేలి ఒళ్ళో తలదూర్చాడు కపాడియా.

'చైనావాళ్ళు ఎందుకు దురాక్రమణ చేసినట్లు ?'

చమేలీ అమాయికంగా అడిగిన ప్రశ్నకు నవ్వొచ్చింది కపాడియాకి.

"చైనాదేశంలో దేశవైశాల్యానికి మించిన జనాభా పెరిగి పోయింది. దానికితోడు 'గ్రేట్ లీప్' అనే ముందంజ ఉద్యమం విఫలమై ఆహారసమస్య ఏర్పడి తీవ్రరూపం దాల్చింది. వారికి మన దేశం పచ్చగా కనపడింది. చీడ పురుగుల్లా వ్రాలారు.

చైనా ప్రభుత్వం తమకు మించిన భారం మోస్తూ 'రెడ్ ఆర్మీ'ని పోషించడం ప్రారంభించింది. ప్రపంచంలో ఇంత పెద్ద సైన్యం, అంటే 700 మిలియనులు ఎవరికీలేదు. 'కళ్ళప్పగించి వింటున్న చమేలిని చూస్తుంటే ముద్దొస్తోంది కపాడియాకు.

'మా సింగ్‌ఫో జాతివాళ్ళలో చాలామందికి సైన్యంలో

చేరాలని ఉంది. కాని వాళ్ళకు వివరాలు తెలియవ్!' తన కున్న సందేహాలను ఆర్డర్‌లో జ్ఞాపకం తెచ్చుకుంటూంది చమేలీ.

'చమేలీ! మీ నీఫా ప్రాంతం కేంద్రప్రభుత్వ పరిపాలనలో ఉంది. ఇక్కడ వైద్యవిద్యా సదుపాయాలు కలుగజేయడా నికి ఈ మధ్యనే ప్రయత్నాలు ప్రారంభించింది ప్రభుత్వం.'

'మీ జాతివాళ్లు జవాన్లుగా ఖచ్చితంగా సూటవుతారు. 18 సంవత్సరాలు దాటి వయస్సు, 5 అడుగుల 6 అంగుళాల ఎత్తు, 34 అంగుళాల ఛాతీ, 112 పౌండ్ల బరువు, ఆరో క్లాసు చదువు' ఇవీ సిపాయికి కావల్సిన అర్హతలు."

"భారత్ బాబూ! చెప్పడం మరిచాను. మేము బంధించిన చైనీస్ సైనికుల్లో చాలామంది ముసలివాళ్ళు కనబడ్డారు. చూస్తూ చూస్తూ వాళ్ళని చంపబుద్ధికాలేదు ఆ వయోవృద్ధు లను బంధించి, తిండిపెడుతున్నాం- చివరికి భారత సైనికు లకు అప్పచెప్పాలని'.

కరువుతీరా నవ్వాడు కపాడియా.

"ఎందుకూ నవ్వడం?" కనుబొమ్మలు ముడిచి, కోపం ప్రదర్శిస్తూ అడిగింది చమేలీ.

"మరి? వాళ్ళ నాయకుల్లో, మచ్చుకైనా కానరాని జాలి గుండెను నీలో చూసుకొని ఏడ్వమంటావా?"

ఆమె ఒళ్లో పడుకున్న కపాడియా తలపైకెత్తి చిలిపిగా చమేలీ గడ్డం కొరికాడు.

"అలుక మాను డియర్! అసలు విషయం చెబుతాను విను. 1949 నుండీ చైనా కమ్యూనిస్ట్‌పార్టీ అధీనంలో నడుస్తోంది. వాళ్ళ పద్ధతులు బహు విచిత్రమైనవి. 'అమ్మ పెట్టా పెట్టదు, అడుక్కుతినా నివ్వాదు' అన్నట్లు కాంటన్,

షాంగ్రై, పీకింగ్‌లలో పట్టుబడిన బిచ్చగాళ్ళనబడే, అస్థి పంజరాలకి సైన్యపు దుస్తులు తగిలించి మొదటగా మన సరిహద్దుల్లోకి తరిమేస్తారు. తర్వాత ద్వితీయ శ్రేణిలో ఉద్యోగం నుండి విరమించిన ప్రభుత్వాకాధికారులు, ముసలివాళ్ళు ప్రత్యక్షమవుతారు. ఎందుకొచ్చిందిరా భగవంతుడా! అనుకుంటూ.

తృతీయ శ్రేణిలో కమ్యూనిస్టుపార్టీ నుండి బహిష్కరించబడిన వారుంటారు. చతుర్థ శ్రేణిలో నిజమైన 'రెడ్ ఆర్మీ' వస్తుంది.

భారత సైనికులు తమవద్ద నిలవుంచిన మందుగుండు సామగ్రి ప్రథమ, ద్వితీయ, శ్రేణులపై ఉపయోగిస్తారనీ, చివరకు రెడ్ ఆర్మీ కబంధహస్తాల్లో చిక్కిపోవాలనీ వాళ్ళ ప్లాన్."

"చాల విషయాలు చెప్పారు. థాంక్స్!" అంది సంతృప్తిగా చమేలీ.

"సీ థాంక్స్ ఎవడికి కావాలి? ముద్దుల్లాంటి వేమీలేవా?" గారాబంగా అడిగాడు కపాడియా.

"అబ్బ. ఆశ! అస్సమానం!" కొంటెగా నాలికతో వెక్కిరించి అక్కడినుంచి తుర్రుమంది చమేలి.

అప్పటిదాకా దొంగచాటుగా వారి మాటలు విన్న ఓ ఆకారం, అంతకుముందే అక్కడినుంచి నిష్క్రమించింది.

# 17

కటిక చీకటి. చలి దంచేస్తోంది. బాంబూ హౌస్‌లో గుడ్డిదీపం వెలుగుతోంది. దానికెదురుగా మంచంమీద మఠం వేసి కూర్చొన్న కపాడియా ఏదో ఆలోచిస్తున్నాడు తీవ్రంగా.

అతని కెదురుగాఉన్న కొయ్యటేబులుమీద కొన్ని మాప్‌లు

పరుచబడి ఉన్నాయి. ఏవో ప్రశ్నలువేసి తనకుతానే సమాధానం చెప్పుకొంటున్నాడు కపాడియా.

కొంతసేపటికి మాప్‌లు ముడిచి కిట్‌లో సర్దాడు. అంతలో "సప్పర్ రెడీసాబ్!" అంటూ గుమ్మంలో చమేలీ కంఠం వినబడింది.

కపాడియా చటుక్కున కాళ్ళుచాచి పడుకొని, ముసుగు తన్నాడు

ఆమె మంచం వద్దకువచ్చి చేతిలోని సామగ్రి స్టూల్‌మీద పెట్టింది పింగాణీ పాత్రలో ఏదో ద్రవపదార్థం ఘుమ ఘుమలాడుతోంది. దాని ప్రక్కగాఉన్న లోహపుగిన్నెలో కొన్ని ఆకుపచ్చని అడవిదుంపలు, ఎఱ్ఱటి పళ్లు ఉన్నాయి.

"భారత్ సాబ్! లేవండి! భోజనానికి వేళయింది." తట్టి లేపింది చమేలి.

ఉలుకు పలుకూ లేదు కపాడియా నుంచి. అతని మీదకు వాలింది చమేలీ! "మధ్యాహ్నం దొరగారిమాట వినలేదని కోపమా?" అడిగింది.

"నాతో మాట్లాడకు. నాకు ఆకలి లేదు. నువ్వెళ్ళొచ్చు!" అన్నాడు ముసుగులోంచే, కపాడియా.

"ఆకలెందుకుండదు? ఆహార పదార్థాలు ఉన్నవి ఉన్నట్లుగా పట్టుకెళితే నాన్నా తాటవలుస్తాడు. అబ్బ! లేవండి!" అంటూ ముసుగు వెనక్కి లాగింది చమేలీ

"చమేలీ! నా మనసు బాగోలేదు. నన్నొదులు!" అన్నాడు కపాడియా మళ్ళీ ముసుగు కప్పుకుంటూ. "అయినా ఓరాతి హృదయాన్ని ప్రేమించడం నాదీ బుది తక్కువ" ముసుగులో గొణిగాడు కపాడియా.

తర్వాత రెండు నిముషాలకి వెక్కిళ్ళు వినబడ్డాయి

కపాడియాకి. అదిరిపడి బయటకి చూసాడు.

చమేలీ తల వంచుకొని సన్నగా రోదిస్తూ వెళ్ళిపోతుంది వట్టిచేతులతో. దడాలున పైకిలేచాడు కపాడియా. "చమేలీ! అడుగుముందుకు వేస్తే నా శవాన్ని కళ్ళజూస్తావ్! దాదాపు అర్చాడు భరత్.

చమేలీ ఆగిపోయింది. ముఖాన్ని అరచేతుల్లో దాచుకొని వెక్కి వెక్కి ఏడుస్తోంది. కపాడియా గుండెను చేతుల్లోకి తీసుకొని ఎవరో నలిపేసినట్లయింది.

"చమేలీ! ఇటుచూడు" ఆప్యాయంగా పిల్చాడు. తల పైకెత్తింది చమేలీ. రెండు చేతులు చాపాడు కపాడియా. అంతే! రాకెట్‌లా పరిగెత్తుకుంటూవచ్చి కపాడియా గుండెల మీద ఇరుక్కుపోయింది చమేలి.

"క్షమించు చమేలీ! నిన్ను బాధపెట్టాను" అతని చేతులు ఆమె కురులను నిమురుతున్నాయ్ ప్రేమగా.

దుఃఖాన్ని కంట్రోల్ చేసుకొంటోంది చమేలీ. ఆమె గడ్డం పైకెత్తాడు భరత్.

ప్లీజ్. మాట్లాడు చమేలీ! నువ్వేడుస్తే నాకు భయం వేస్తోంది తెల్సా!" అన్నాడు బెంగగా.

ఆమె కళ్ళు ఇంకా వర్షిస్తున్నాయ్! మెల్లగా పెదిమలు కదిపింది "ప్రియుడు తన ప్రేమను శంకిస్తే ఏ'స్త్రీ'కి ఇక బ్రతకాలని పించదు భరత్‌బాబూ!" అంది వెక్కిళ్ళతో.

ఆమె రెండు చెంపలమీద చేతులువేసి, కళ్ళమీద ముద్దు పెట్టుకొన్నాడు కపాడియా. "ఏదో సరదాగా అన్నాను. నీది ఎంతమాత్రం రాతి హృదయం కాదు చమేలీ! అమృత హృదయం!! ఇంకెప్పుడూ అలా అనను. నన్ను క్షమించవా చమేలీ?" అర్థింపుగా అన్నాడు కపాడియా.

చమేలీ సున్నితంగా అతని చేతుల్ని విడిపించుకుంది. ఓ చేత్తో కళ్ళు తుడుచుకుంది.

హాయిగా ఊపిరిపీల్చాడు కపాడియా. చటుక్కున స్టూల్‌మీద పళ్ళమధ్య ఉన్న కత్తి అందుకొన్నాడు. షర్ట్ పైకిలాగి ఎడమ ముంజేతిని ఓ అంగుళం పొడవున కోశాడు.

"భరత్‌బాబూ! ఏమిటది?" గాభరాగా అరిచింది చమేలీ.

"నా సంతృప్తి కోసం" అంటూ తన రక్తాన్ని బొటన వ్రేలితో అద్ది ఆమె నుదుటిమీద బొట్టుపెట్టాడు.

"చమేలీ! నా సొంత రక్తంమీద ప్రమాణం చేసి చెబుతున్నాను. నాది పరిశుద్ధమైన ప్రేమ. నువ్వు తోడులేని జీవితం నాకు వద్దు. నువ్వు నామీంచి కళ్ళుతిప్పితే బ్రతకలేను." కపాడియా మాటలు పూర్తి కాకమునుపే చమేలీ అతని మెడచుట్టూ చేతులువేసింది. "భరత్‌బాబూ! ఎలా చెప్పేది? నువ్వే నా ప్రాణం...అంటూ ఆవేశంగా అతని చెంపలనీ, అతని గెడ్డాన్నీ, అతనిమెడనీ, అతని కనుబొమ్మలనీ, అతని ముక్కునీ, అతనిజుట్టునీ, ముద్దులతో నింపింది. చటుక్కున వంగి అతని పాదాలని తన నుదుటితో తాకింది. ఎక్కడో గంటలు మ్రోగిన శబ్దమైంది. ఆమె గుండ్రటి భుజాలపై చేతులువేసి పైకి లేవనెత్తాడు కపాడియా.

"రా చమేలీ! ఇద్దరం భోంచేద్దాం!"

"నేను తిన్నాను!"

"అబద్ధం. ఇవాళ నీ చేతులతో పెట్టనిదే తినే ప్రశ్నే లేదు."

# 18

"చమేలి! రేపుఉదయాన్నే వెళ్ళిపోతున్నాను. జ్ఞాపకం ఉంటానా?" అన్నాడు కపాడియా ఆమె చేతిని తన చేతి

లోకి తీసుకొంటూ.

పిడుగులు పడినట్లయింది చమేలీకి. "జోక్ చేస్తున్నారా?" కోపంగా అడిగింది.

"ఛ: లేదు చమేలీ! నా బాధ్యతలు తీర్చుకొంటేనే గాని నాకు మనశ్శాంతి ఉండదు. పరిస్థితులు చక్కపడినవెంటనే నాట్ విమానంలా దూసుకువచ్చి, నీ ఒళ్ళో వాలిపోతాను. నామీద నమ్మకంలేదా?" అన్నాడు కపాడియా ఆమె అర చేతితో తన చెంపమీద రాసుకొంటూ.

"అదికాదు. ఈ గాయాలు మానకుండానే..."

"పిచ్చిపిల్లా! ఆ గాయాలవిషయం ఎప్పుడో మర్చిపో యాను. నీ చెయ్యి పడిందిగా."

"రేపు మంచిరోజుకాదు. నాన్న వెళ్ళనివ్వడు మిమ్మల్ని" గొల్లున నవ్వాడు కపాడియా. "ఖర్మ! ఇక్కడకూడా జోతిష్యాలు, ముహూర్తాలు ఉన్నాయా? సిపాయి ముహూర్తం పెట్టుకొని తుపాకీకాల్చడు. శత్రువు మన ముహూర్తందాక ఆగడు."

చటుక్కున అతని ఒళ్ళోదూరంచె చమేలీ, "భరత్ బాబూ! అదికాదు అసలుకారణం. నేను మీతో వస్తాను. ఇక్కడ నాకేం తోచదు." ఆమె ముఖంమీదకు వంగాడు భరత్. "చమేలి! మతిపోయిందా నీకు" ప్రేమగాఅన్నాడు జుట్టునిమురుతూ.

"ఉహుఁ! ఈసారికి నామాట వినండి. పైగా మీరు ఇప్పుడు దేశానికి ఓ విలువైన వ్యక్తి. ఈ అడవిలో మీ కేదైనా ప్రమాదం జరిగితే..." అంది లెంపలువేసుకుంటూ చమేలి.

చాలసేపు ఆలోచించాడు కడిపాయా. ఆమెను బలంగా

బంధిస్తూ "చమేలీ! నువ్వు నాతో వస్తున్నావ్": అన్నాడు

"థాంక్యూ!" అంది నోరు సున్నాలా పెట్టి చమేలి.

X X X X

మర్నాడు ఉదయం కమాండర్ కపాడియాకి సింగ్‌ఫో, జాతి మర్యాదలన్నీ ఘనంగా చెయ్యబడ్డాయి. ఎత్తైన రాతి మీద కూర్చున్నాడు సింగ్‌ఫో జాతి నాయకుడు బోబో. అతని చేతిలో బల్లెం ఉంది. అరవై యేళ్ళ వృద్ధుడాతడు. అతని చుట్టూ రంగురంగుల దుస్తుల్లో ఉన్న కొంకజాతి స్త్రీలు తతంగం చూస్తున్నారు.

"మన విషయం చెప్పావు." భరత్ చెవిలో గొణిగింది చమేలి.

"ప్రతికించావ్. లైన్ క్లియర్ అన్న మాట?" ఆమె నడుంమీద సీక్రెట్‌గా గిల్లాడు.

కిసుక్కున నవ్వింది చమేలి.

ఇద్దరూ నాయకుడి పాదాలకు నమస్కరించారు.

బోబో ఏదో భాషలో ఆశీర్వదించి ఇద్దర్నీ పైకి లేవదీశాడు. ఇరువురి నుదుటికి రక్తవర్ణ తిలకం దిద్దాడు. అంతలో ఓ స్త్రీ చేతిలోని పళ్ళెంతో అటువచ్చింది. పళ్ళెం మీద ఎఱ్ఱటి గుడ్డ కప్పబడిఉంది. గుడ్డ పక్కకి తొలగించాడు బోబో.

'పచ్చలపిడిబాకు!' సూర్యకాంతిలో ధగధగా మెరుస్తోంది. దాన్ని కపాడియాకి బహూకరించాడు నాయకుడు. కొంక జాతి స్త్రీలంతా హర్షధ్వానాలు చేసారు.

పిడిబాకుని కళ్ళకద్దుకొని చమేలీ చేతిలో ఉంచాడు కపాడియా. తన షర్టుపైబొత్తం విప్పాడు. అందరూ అతనికేసి వింతగా చూడసాగారు. భారత్ తన మెడకున్న అడుగు

పొరవున్న గోల్డ్ చైన్ తీసి బోబో మెడలో వేసాడు. గొలుసు చివర, గుండ్రటి బిళ్ళమీద భారతమాత త్రివర్ణపతాకం ధరించి నవ్వుతూ నిలబడివుంది.

పొంగిపోయాడు నాయకుడు. సంతోషంతో పిచ్చికేకలు పెట్టారు అక్కడి జనం.

తర్వాత చమేలీని కౌగలించుకొని సన్నగా రోదించాడు బోబో. "చమేలీ వెళ్ళడానికి వీల్లేదు" ఎవరో అరిచారు.

అటువైపు చూశారు అంతా.

"సబాటా!"

దెబ్బతిన్న బెబ్బులిలా చూస్తున్నాడు.

"చమేలీ" చిన్నగా పిల్చాడు కపాడియా.

"వాడో మూర్ఖుడు. చైనావాళ్ళదగ్గిర కప్పలు, పాములు తినడం నేర్చుకొన్నాడు. పీకలదాకా తాగడం, ఆడవాళ్ళని వేటాడ్డం వాడి పైశాచిక ఆనందాలు. నేను అందని ద్రాక్ష పండునని తెలి పిచ్చికేకలు వేస్తున్నాడు."

బోబో ఎవరికో సైగ చేశాడు. మరుక్షణం ఇద్దరు వజ్రకాయులు సబాటాని పెడరెక్కలు విరిచి దూరంగా తీసుకుపోయారు.

# 19

"అబ్బ! ఇంకెంతదూరం?" ఓ బండరాయిమీద చతికిలబడిపోయింది చమేలీ.

"మహా ఉంటే రెండుమైళ్ళు. ఖర్మరా బాబూ? సంత కెడుతూ పిల్లిని చంకన పెట్టుకున్నట్లైంది నా పని. అందుకే అన్నారు పెద్దలు ఆడది వంటింట్లోను, పడకింట్లోను తప్ప మరోదానికి పనికిరాదని. నడవండి మేడమ్‌సాబ్!"

"ఏడిశారు. నేను 100 మంది చైనావాళ్ళని 'ఖతం'

చేసిన కాళీమాతని!"

"చిత్తం! నడుస్తారా ఇక?"

"దాహంగా ఉంది భరత్‌బాబూ!"

"ఏం చేద్దాం? మన దగ్గిర అధరామృతం తప్ప మరోటి లేదే!" కొంటెగా అన్నాడు కపాడియా. కోపంగా చూసింది చమేలి.

"ఆల్‌రైట్" అంటూ మాప్‌లోకి చూశాడు భరత్. "హేయ్! చమేలీ! యు ఆర్ లక్కీ! మరో అరఫర్లాంగ్ దూరంలో ఓ నుయ్యి ఉంది."

"ఎలాతెల్సు? అంతా నాటకం"

"కాదు మేడామ్! ఈ రూట్ మాప్ చూడు!"

అందులోకి చూసింది చమేలీ "మాలూమ్‌నై సాబ్!" అంది చేదు మాత్ర మింగినట్లు.

"అంత త్వరగా అర్థంకాదులే! మాప్ రీడింగ్ ఓ వారం రోజుల శిక్షణ. శాంపిల్‌గా కొన్ని బండ గుర్తులు చెబుతాను. మాప్‌లోకి చూడు"

"ఇదిగో ఇక్కడా సున్నా జే.సుబడిఉంది. చూసావా? అది నీరు లేని ఓ నుయ్యికి చిహ్నం. ఆసున్నా లోపల రంగు పూసిఉందిచూడు అది నీరు ఉండే నుయ్యికి గుర్తు. ఇంగ్లీషు Q అక్షరాన్ని చెట్టుకు బదులుగా వాడతారు. అడ్డంగా రెండు గీతలు గీసిఉంటే అక్కడ రోడ్ ఉందన్న మాట. ఇక్కడ టోపీలాంటి ఆకారం ఉంది చూడు. అది దేవాలయానికి చిహ్నం."

సంతృప్తిగా తల పంకించింది చమేలీ.

"అర్థమైంది. ఇంకో ప్రశ్న ఎప్పటినుంచో అడగాలను కొంటున్నాను."

"నడుస్తూ అడుగుదువ్‌గానీ" ఆమెను పైకి లేవదీసాడు కపాడియా. అతని జబ్బను తన చేత్తో బంధించి హుషారుగా నడవసాగింది చమేలీ

"సైనికుడికి రైఫిల్ ఉంటుంది. అందులో గుళ్ళు ఉంటాయ్. బస్, ఇంకా బాయ్‌నెట్ ఎందుకు? గుళ్ళు లేనప్పుడు ఉపయోగించడానికా?" యాక్షన్ చేస్తూ అడిగింది చమేలి.

నవ్వాడు కపాడియా. "అది కాదు అసలు కారణం. శత్రువు ఓ రెండు గజాల దూరంలో ఎదురైనపుడు సైనికుడిని రైఫిల్‌ని ఎయిమ్‌లోకి తెచ్చుకొని పేల్చడానికి టైముండదు. అలాంటి పరిస్థితులలో పెద్ద కేక పెడుతూ ఎదురుగా ఉన్న శత్రువుని బలంగా పొడుస్తాడు బాయ్‌నెట్‌తో. అంతా క్షణాల్లో జరిగిపోవాలి సైనికుడు అరిచిన అరుపు వల్ల ప్రత్యర్థి వెంటనే హడలిపోతాడు. ఆ టైమ్‌ని సద్వినియోగం చేసుకొని పోటు పొడవాలి."

"బావుంది" అంది చమేలీ అతని కేసే ప్రశంసగా చూస్తూ.

"ఏమిటి? నా ముఖం అంత బాగుందా?" పొంగిపోతూ అన్నాడు కపాడియా.

"ఛీపో! ఇప్పుడు చెప్పినపాఠం"

# 20

"చమేలీ! ఎంతసేపు మంచినీళ్ళు తాగడం? త్వరగారా! అరిచాడు కపాడియా. చమేలీ పల్లంలోంచి గబ గబా వచ్చింది పెదిమల కంటిన తడి తుడుచుకుంటో. "పదండి వెళాం".

ఇద్దరూ నడక ప్రారంభించారు. "కపాడియా! ఇంతకూ

ఆ యుద్ధవ్యూహాలు సరిగ్గా జాగ్రత్తచేసారా?" అడిగింది చమేలి.

ఆమె ముఖంలోకి చూసాడు కపాడియా "నేనంత పిచ్చి వాడినికాదు చమేలీ కిట్ దాచడానికి"

"మరి?"

"చెప్తాను" చమేలీని దగ్గరగా తీసుకొని ముద్దుపెట్టు కున్నాడు. చమేలీ అభ్యంతరం చెప్పలేదు బొటన వ్రేళ్ళమీద నిలబడి అతని మెడ చుట్టూ చేతులు వేసింది.

అంతే! చమేలీ చంప ఛెళ్ళుమని మ్రోగింది. ఆమె చేతులు వెనక్కి విరిచి పట్టుకున్నాడు కపాడియా. "ఎవరు నువ్వు? నా చమేలీవికావు:" గర్జించాడు.

ఆమె మాట్లాడలేదు. "కమాన్! త్వరగా చెప్పాలి. నా చమేలీ నేంచేసావ్? ఆమె వంటి మీద ఈగ వాలితే భగ వంతుణ్ణ కూడా క్షమించను"

X X X

తననుదుటితో ఆమె తలను బలంగా ఢీ కొట్టాడు "క్విక్" అర్చాడు. రక్తం చిమ్మింది ఆమె నొదుటపై

"చెప్తాను, నేను చమేలీకాదని ఎలా కనిపెట్టావ్?"

"నువ్ నన్ను కపాడియా అని పిల్చినప్పుడే డౌట్ వచ్చింది. చమేలీ ఎప్పుడూ భరత్ బాబూ! అని పిలుస్తుంది."

"రెండు. నేను ప్రక్కనుండగా ఆ కాగితాల గురించి అడగవలసిన అవసరం చమేలీకిలేదు."

"మూడు. చమేలీ ముద్దు అంత చవగ్గా దొరకదు. ఏడిపి స్తుంది చాలసేపు. నీలాగ ఎగబడలేదు ఎప్పుడు."

ఆమెను చెట్టుకు కట్టివేసాడు కపాడియా

"ఎవరు నువ్వు? అంత త్వరలో మేకప్ మార్చుకోగలి గాపంటే గూఢచారిణివయ్యి ఉండాలి నువ్వు."

"అవును చైనా గూఢచారిణిని. చిన్‌లీ నా పేరు"

"ఎక్కడ నా చమేలీ"

మౌనం వహించిందామె జేబులోంచి పిడిబాకు తీసాడు కపాడియా

"క్విక్ ఆడదానివని జాలితలచను, ముక్కుకోసి చేతిలో పెడతాను. గుడ్లు పెళ్ళగిస్తాను" అర్చాడు కపాడియా.

భయంగా చూసింది చిన్‌లీ "చెప్తాను నూతి దగ్గర స్పృహ పోగొట్టి ఆమె వేషం వేసుకొన్నాను. అక్కడే వదిలేసా ఆమెని"

''యూ బిచ్!'' కపాడియా చెయ్యి గాలిలోకి లేచింది. ఆమె పెదవి చిట్లింది ''ఎవ్వరు చెప్పారు కాగితాలు నా దగ్గరున్నాయని? దెబ్బకు దయ్యం పలుకుతుంది.

"సబాటా! మా చైనా సైనిక శిబిరానికి వచ్చి రిపోర్టు చేసాడు."

విషయం అర్థమైంది కపాడియాకి "చమేలీ తనది కాలేదన్న అసూయతో ఈ పని చేసుండాలి. అంతే! చమేలీతో తను మాట్లాడిన విషయాలు దొంగ చాటుగా విన్నాడన్న మాట!!''

''రాక్షసీ! అక్కడ చమేలీకి చీమ కుట్టిందంటే నీ ఒళ్ళు కైమా చేస్తాను. ఆమె నోటికి సెలోటేప్ అతికించి నూతివైపు పరిగెట్టాడు కపాడియా.

# 21

"చమేలీ! నేను అటువైపు చూస్తూ నిలబడతాను. నువ్ ఆమె ఒళ్ళంతా చెక్‌చెయ్! జాగ్రత్త కరుస్తుంది. ఒంటి నిండా కోరలుంటాయామెకు".

చమేలీ చైనా గూఢచారిణి దుస్తులు వెతికింది. స్కర్టు

సాకెట్‌లో రివాల్వర్ దొరికింది. కొంత సేపటికి ఆమె వక్షోజాల మధ్యనుండి ఓ మడతపెట్టబడిన కాగితం తీసింది.

"భరత్ బాబూ!" పిల్చింది.

కాగితం అందుకున్నాడు కపాడియా. మధ్యగా డ్రాగన్ బొమ్మ ఉంది రంగుల్లో. డ్రాగాన్ అన్నది "చైన్ మైథాలజీ" లో వర్ణించబడ్డ ఓ భయంకరమైన పాకే జంతువు. దాని గోళ్ళు సింహానివి. రెక్కలు గరుడ పక్షివి. పాముతోక దానికి కోపం వస్తే భయకరంగా బుసలు కొడుతుంది. పూర్వం ఆ జంతువు చైనా చక్రవర్తులకు రాజముద్రగా ఉపయోగపడేది.

"చమేలీ! ఈ బొమ్మలో ఏదో రహస్యం ఉంది. సరదాకి పెట్టుకు తిరగదు చిన్‌లీ. బహుశా మైక్రోడాట్స్ ఉండొచ్చు.

"అంటే?"

"తర్వాత చెబుతాను. ప్చ్. మనకి టైమ్‌బాగా వేస్టు అవుతోంది. ఈమేనేంచేద్దాం? ఇక్కడ ఉంచటం చాల డేంజర్. చైనీస్ గూఢచారిణి ఈమె. ఎలాగైనా తప్పించుకొని కొంప ముంచేస్తుంది".

"ఓ అయిడియా"

"త్వరగా చెప్పు!"

"నేను రెండు ముంచుకోతులను పెంచేదాన్ని. చైనా వాళ్ళని చేటాడ్డానికి బాగా ట్రైనింగ్ ఇచ్చాను వాటికి. అవి ఈ అడవిలోనే తిరుగుతుంటాయ్"

"ఏదో చెయ్ త్వరగా!"

చమేలి గబగబా ఓ చెట్టుఎక్కి రెండు చేతులు, నోటి ముందుంచుకొని విచిత్రమైన శబ్దాలు చేసింది.

రెండు నిముషాల్లో ఎలుగుబంటి సైజులో ఉన్న రెండు మంచుకోతులు గెంతుకుంటూ వచ్చాయి.

ముట్టుకొంటే మాసిపోయేటంత తెల్లగా ఉన్నాయవి. కపాడియా వాటినిచూసి నిశ్చేష్టుడయ్యాడు.

'బహుశా అవి పరిశోధకులు వర్ణించే హిమాలయాల్లోని 'ఏటి' (yeti) లకు, మామూలు జాతికోతులకు, క్రాసింగ్ వల్ల పుట్టిఉండాలి' అనుకున్నాడు కపాడియా.

చమేలి వాటితో ఏదో భాషలా మాట్లాడింది. మంచు కోతులు పళ్ళికిలించి చమేలీకి, కపాడియాకి షేక్ హాండ్ ఇచ్చాయి. మరుక్షణం కాళ్ళు, చేతులు బంధించబడిన చైనీస్ గూఢచారిణిని, చీపురుపుల్లంత తేలిగ్గా ఎత్తుకొని, చెట్లమధ్య మెరుపుతీగల్లా మాయమయ్యాయి.

# 22

"చమేలీ!" పిచ్చిగా అరిచాడు కపాడియా

అది ఆనందం పట్టలేక వేసిన పొలికేక.

"ఏమయింది!" వెనుకబడ్డ చమేలీ పరిగెత్తుకుంటూ వచ్చింది.

"టాంగ్ పాంగ్లా వచ్చేసాం!! అదిగో అక్కడ చిన్న కొండశిఖరం కనబడుతోంది చూడు! దాన్నే 'బుమ్లా యాక్సిన్' అంటారు"

"మరి మన సైనిక గుడారాలు కనబడ్డంలేదేం"

"ఓహ్ చమేలీ ! అదేం ఎగ్జిబిషన్ కాదు! గుడారాలు కనబడేలా ఉంచడాన్కి. పైగా కీలకమైన స్థావరం. సరిగ్గా చూడు. శిఖరంమీద ఆకులు, కొమ్మలు, పరిచినట్లున్నాయ్ అదికొంత అసహజంగా లేదూ?"

కపాడియా మెడలోని బైనాక్యులర్స్ లాక్కొనిచూసింది

చమేలీ. "కరెక్ట్ ఏమిటి అలాఉన్నాయవి?"

"గుడారాల మీద వలలు కప్పేసి వాటిమీద పొదల రంగులో కల్సిపోయేలా ఆకులు, కొమ్మలు పరుస్తారు."

"శిఖరం క్రింది భాగంలో భారత సైనికులు మార్చింగ్ చేస్తున్నారు. అదేమిటి? వాళ్ళు V ఆకారంలో నిలబడి డ్రిల్ చేస్తున్నారు!"

"ఏదీ నన్ను చూడనీ!" అంటూ బైనాక్యులర్స్ లోంచి ముందుకి చూసాడు కపాడియా.

"ఓహ్! అదా! దాన్ని యారోహెడ్ ఫార్మేషన్ అంటారు."

"చమేలీ, సైనికులు తామునడిచే స్థలాన్నిబట్టి మార్చింగ్ చేసుకొంటూ ముందుకి పోవాలి.

సన్నగా ఉన్న ఖాళీలో గుంపుగా వెళ్ళలేముకదా! అప్పుడు 'ఒన్ బై ఒన్' వెళ్ళాలి."

"అలాగే ఖాళీగ్రౌండ్‌లో ఫార్వర్డ్ మార్చ్ చేస్తు ఇప్పుడు ఒకేలైన్‌లో వెళితే ప్రమాదం. శత్రువులు టపటపా కాల్చి పారేస్తారు. అలాంటప్పుడు సైనికులు గుండ్రంగా ఫార్మ్ అయి ముందుకు నడుస్తారు. ఆ పరిస్థితిలో శత్రువులు ఏ దిక్కునుండి దూసుకువచ్చినా ; సులువుగా సమాధానం చెపొచ్చు.

ఈ విధంగా మొత్తం ఫార్మేషన్స్ ఆరు రకాలు. వాటిని సింగల్‌లైన్ ఫార్మేషన్స్, ఫైల్ ఫార్మేషన్స్, యారోహెడ్ ఫార్మేషన్స్, డైమండ్ లైన్‌ఫార్మేషన్స్, ఎక్స్‌టెండెడ్ లైన్‌ఫార్మేషన్ మరియు స్పియర్ హెడ్ ఫార్మేషన్ అని పిలుస్తారు.

"లెట్స్‌గో నౌ!" అన్నాడు కపాడియా ఆమె నడుం

చుట్టూ చెయ్యివేసి.

"రేయ్! కపాడియా!" కపాడియాను అల్లంత దూరంలో చూసి, ఆశ్చర్యంగా పరిగెత్తుకుంటూ వచ్చి కపాడియాని ఆప్యాయంగా కౌగలించుకొన్నాడు టాంగ్‌పాంగ్లా ఏరియా కమాండర్ ఇంద్రజిత్ అరోరా!

ఇది కలా! నిజమా? అనిపించింది కపాడియాకి. కపాడియా, ఇంద్రజిత్‌కి క్లాస్‌మేట్ కమ్ రూంమేట్. ఇద్దరూ మణిపూర్ స్టేట్‌లోని ఇంఫాల్ పి జి టి. కాలేజీలో చదువు కొనేవారు. ఇద్దరూ ఎన్.సి సి అంటే పడిచచ్చేవారు. 'సి' సర్టిఫికెట్ ఎక్జామ్ ఒకేసారి పాసయ్యారు. ఆర్మీలో ఒకేసారి జాయిన్ అయ్యారు. ఇద్దరి ఆదర్శాలు ఒకటే, ఇద్దరి భావాలు ఒకటే! కపాడియా తల్లి ఇంద్రజిత్‌ని రెండో కన్నుగా చూచుకొనేది. ఆర్మీలోకూడా ఇద్దరూ పాటుపడి పరీక్షలు వ్రాసేవారు. అయితే ఇంద్రజిత్ కొంచెం వెనక పడ్డాడు ఓ పరీక్షతప్పి.

"నువ్వెప్పుడు ప్రొమోషన్ కొట్టేసావ్రా ఫూల్! మొత్తానికి నామీద పగతీర్చుకొన్నావన్నమాట" అంటూ అతని వీపుతట్టాడు కపాడియా.

"ఈమె......" చమేలీ వైపు చూస్తూ ఆగిపోయాడు ఇంద్రజిత్.

"సీక్కాటోయే వదిని"

"ముబారక్ హో బ్రదర్! రణరంగంలో ప్రణయ రంగం అన్నమాట!"

"అదిసరే, అమ్మెక్కడుందిరా ఇప్పుడు?" ఆతృతగా అడిగాడు ఇంద్రజిత్.

"బొంబాయిలో. ఆవిషయాలన్ని తర్వాత. ముందునాకు

ఓ మంచి మైక్రొస్కోప్ కావాలి."

మామూలు మంచేంఖర్మ! ఫుల్‌షార్ట్‌ఫోకస్ మైక్రో స్కోప్ ఉంది. 'జర్మనీమేక్' సప్లైచేసింది మన ప్రభుత్వం అంటూ ఇరువురినీ ఆదరంగా లోపలికి తీసుకెళ్ళాడు.

మైక్రోస్కోప్‌లో డ్రాగన్ బొమ్మ ఓసారి పరీక్షించాడు కపాడియా. ఆ బొమ్మలో మైక్రోడాట్ ఉండడానికి వీలయ్యే ప్రదేశం వెతికాడు. తర్వాత అనుమానంగా, డ్రాగన్ కన్నుని మైక్రోస్కోపు క్రిందుంచాడు.

"ఇంద్రక్! కొంపమునిగింది" అరిచాడు కపాడియా లెన్స్‌లోంచి చూస్తూ.

"ఏమయింది ?"

"నువ్వేచూడు" అంటూ తలపైకెత్తాడు కపాడియా.

ఇంద్రజిత్ అరోరా అద్దంలోంకి చూడసాగాడు. మైక్రో డాట్‌లో అక్షరాలు మెరుస్తున్నాయి. కూడబలుక్కుంటూ చదవసాగాడు ఇంద్రజిత్

"కేంద్రీకృతంకండి- 22వ తేది- టాంగ్‌పాంగ్లాపై భారీ ఎత్తున దాడి" ఇంగ్లీష్‌లో ఉన్నాయి అక్షరాలు.

"ఇవాళ తారీకు 18" గొణిగాడు కపాడియా

ఇంద్రజిత్ అరోరా, కపాడియాని తటాలున కౌగలించు కొన్నాడు.

"నాపాలిట దేవుడిలావచ్చావురా భరత్! తగినజాగ్రత్తలు తీసుకుంటాను"

X X X

"కాయా? పండా?" అడిగాడు కపాడియా.

"రెండోదే. హైపవర్ ట్రాన్స్‌మీటర్‌లో మాట్లాడాను. రేపు సాయంత్రానికల్లా ఈ ప్రాంతాల్లో మన వైజయంతి

టాంకులు. సెంచురియన్ టాంకులు వీరవిహారం చేస్తాయి," అన్నాడు ఇంద్రజిత్. చమేలీ వేడివేడి టీని రెండు మగ్గుల్లో పోసి ఇద్దరికీ ఇచ్చింది.

"థ్యాంక్యూ భాబీ!" అంటూ దాన్ని అందుకున్నాడు ఇంద్రజిత్.

"నా విషయం చెప్పలేదురా ఇందర్!"

"అది చెప్పడానికే వచ్చాను. మల్టీఛానెల్ ట్రాన్స్ రిసీవర్ లోకి సిగ్నల్స్ పంపారు మిలటరీ ఇంటలిజెన్స్ బ్యూరో డైరెక్టర్ మిస్టర్ గొడ్‌గాంకర్. వ్యూహాలు తయారు చేసిన నీకు 'కంగ్రాట్స్' చెప్పమన్నారు. మరో రెండు గంటల్లో నీకోసం ఇండియన్ ఏరోనాటిక్స్ కొత్తగా డిజైన్‌చేసిన బుల్లెట్ ప్రూఫ్ శాంపిల్ మినీ విమానం వస్తుందట. అస్సాం లోని గౌహతీ ఎయిర్ పోర్టులో దిగుతావ్ నువ్వు. అప్పుడు ఆ కాగితాలు స్వయంగా ఆయనకివ్వొచ్చు."

"థాంక్స్ ఎలాట్ ఇందర్!"

"నేనే చెప్పాలి నీకు. విశ్రాంతి తీసుకో," అంటూ పైకి లేచాడు ఏరియా కమాండర్ ఇంద్రజిత్ అరోరా, ఉత్సాహంగా.

ఐపోయింది.

# బద్ధ విరోధులు ?

—"రాజా"

గేటు దాటి విక్టోరియా కాలేజి ఆవరణలో ప్రవేశించాడు ప్రవీణ్‌కుమార్.

టైం చూసుకొన్నాడు. పదింపావు అయింది.

గబగబా కాలేజీ బిల్డింగ్స్ చేరుకొన్నాడు. వాచ్ మెన్‌ను అడిగి తెల్సుకొని సెకండ్ ఫ్లోర్‌లో ఉన్న ఫస్ట్ బి కాం క్లాస్ చేరుకొన్నాడు.

ఇంగ్లీష్ లెక్చరర్ ధారాళంగా చెప్పుకుపోతున్నాడు పాఠం.

మే ఐ కమీన్ సర్. 'గుమ్మంలో నిలబడ్డ ప్రవీణ్ కుమార్ అడిగాడు. తలెత్తిచూసాడు లెక్చరరు. క్లాస్‌లో స్టూడెంట్సంతా అతనివైపు చూస్తున్నారు.

'యస్ కమీన్!'

లోనికి నడిచాడు ప్రవీణ్‌కుమార్. క్లాసంతా నిశ్శ

బ్ధంగా ఉండటంవలన అతని బూట్లశబ్దం ప్రతిధ్వనిస్తోంది.

"ఐ యామ్ ప్రవీణ్‌కుమార్. నేటినుంచీ కాలేజీలో జాయిన్ అవుతున్నాను" అన్నాడు లెక్చరువైపు చూస్తూ దగ్గరగా నిల్చుని.

ఆశ్చర్యంగా చూసాడు లెక్చరరు. అప్పటికే కాలేజి బిగినయి రెండు నెలలు దాటింది. కోర్సులుకూడా చాలా వరకు పూర్తయ్యాయి. అందుకే ఆశ్చర్యం కల్గింది లెక్చరరుకు.

"యస్ సర్ కొన్ని కారణాలవలన ఈ లేట్ జరిగింది," ప్రిన్సిపాల్ పర్మిషన్ లెటరు అందించాడు.

అందుకొని దానిని పరిశీలించి ప్రక్కనేఉన్న అటెండెన్స్ రిజిష్టరులో తోసాడు లెక్చరరు.

ప్రవీణ్‌కుమార్ వైపు చూసి అన్నాడు. 'వెల్ మై యంగ్ బాయ్! వెళ్ళి సీట్లో కూర్చో.'

'థాంక్యూ సర్,' అంటూ స్టూడెంట్స్‌వైపు కదిలాడు ప్రవీణ్‌కుమార్.

మొదటి 'రో'లో కూర్చున్న స్టూడెంట్స్‌లో ఒకతను ప్రక్కకు జరిగి ప్లేస్ ఇచ్చాడు. కూర్చొంటూ ఒకసారి క్లాస్‌రూం అంతా పరీక్షగా చూసాడు.

సుమారు అరవైమందుంటారు స్టూడెంట్స్. వారిలో ఇరవైమంది గరల్స్. క్లాస్‌రూం చాలా విశాలంగా ఉంది. అతనివైపే ఆసక్తిగా చూస్తున్నారందరూ.

అతని దృష్టి ఒక్కొక్కరినీ దాటుకొంటూ చివరి వరుసలో మొదటగా కూర్చొన్న స్టూడెంట్‌పై పడింది.

ఉలిక్కిపడ్డాడు ప్రవీణ్‌కుమార్. కనుబొమ్మలు ముడివడ్డాయి.

కళ్ళు చిట్లించి మళ్ళీ చూసాడు. ఎందుకో అతని శరీరం జలదరించినట్లయింది.

అదే ముఖం. అదే ఆకారం, అదే పెర్సనాలిటీ! ఎక్కడో చూసినట్లయింది. కాని ఎంత ఆలోచించినా జ్ఞాపకంమాత్రం రావటంలేదు.

"వాట్ మిస్టర్ ప్రవీణ్? ఏమిటీ ఆలోచిస్తూ నిలబడి పోయావ్?" ఆశ్చర్యంగా చూస్తూ లెక్చరరు అడిగాడు.

"ఎక్స్‌క్యూజ్ మీ సర్," కూర్చొన్నాడు ప్రవీణ్ కుమార్ తన సీట్లో అతడినిగురించే ఆలోచిస్తూ.

లెక్చరరు తిరిగి తన ధోరణిలో పడ్డాడు.

## 2

క్లాసవ్వగానే బయటకు వెళ్ళిపోయాడు లెక్చరరు. క్లాసంతా గోలగా తయారయింది.

బుక్స్‌పట్టుకొని క్లాస్‌రూంలోంచి బైట వరండాలోకి వచ్చాడు ప్రవీణ్ కుమార్.

గంట పదకొండయింది. వెచ్చగా వీస్తున్న గాలితెరలను బిల్డింగ్ ప్రక్కనున్న చింతచెట్లు చల్లబరచి చుట్టూ పంపిణీచేస్తున్నాయి. పిట్టగోడపై చేతులాన్చి దూరంగా కన్పిస్తున్న నైట్ కాలేజీ షెడ్లవైపు చూస్తున్నాడు ప్రవీణ్ కుమార్.

"మిస్టర్ ప్రవీణ్‌కుమార్..."

ఉలిక్కిపడి వెనక్కి తిరిగాడు ప్రవీణ్. అతనే, బుక్స్ స్టయిల్‌గా పట్టుకొని అదోలాచూస్తున్నాడు తనవైపు. మళ్ళీ సంచలనం రేగింది ప్రవీణ్‌కుమార్‌లో.

"యస్..." అన్నాడు తనలోని కలవరపాటు బైటకు కనబడనీయకుండా అదిమిపెట్టడానికి ప్రయత్నిస్తూ.

"నా పేరు జైరాజ్. మీతో కాస్సేపు మాట్లాడాలి!" అన్నాడతను దూరంగా నింగీ నేలా కలిసినట్లనిపిస్తున్న శూన్యంలోకి చూస్తూ. అతని మొఖం ఎందుకో వివర్ణమైంది.

"మాట్లాడండి!"

"యస్!" వివర్ణమైన తన ముఖాన్ని చేతితో రుద్దుకొంటూ అన్నాడు జైరాజ్. రెండు నిముషాలు మౌనంగా గడిచిపోయాయి.

"మిస్టర్ ప్రవీణ్‌కుమార్, దయచేసి మీరు ఈ కాలేజీ మానేసి ఎక్కడికైనా వెళ్ళిపోగలరా?"

"ఎందుకని?" ఆశ్చర్యాన్ని అణచుకుంటూ అడిగాడు ప్రవీణ్‌కుమార్.

"చెబుతాను. మిస్టర్ ప్రవీణ్‌కుమార్, నాకు మీ పేరు తప్ప మీ రెవరో ఎక్కడినుంచి వచ్చారో ఎక్కడ వుంటున్నారో తెలీదు. మిమ్మల్ని నేను చూసింది కొన్ని నిముషాల క్రితమే. కాని మిమ్మల్ని చూస్తోంటే ఈ కొద్ది సమయంనుంచే కాక ఎప్పటినుంచో మీరు నాకు తెల్సినట్లు, అన్యాయంగా నాకు తీరని ద్రోహం చేసినట్లు అన్పిస్తోంది. మిమ్మల్ని చూసిన మరుక్షణం నుంచీ నాలో చెప్పలేని సంఘర్షణ రేగి మీపట్ల నాకు తీవ్రమైన పగనూ, కోపాన్ని రగుల్చుతోంది. మీరంటే భరించలేని కసి పెరిగిపోతోంది...ఎందుకో తెలియటంలేదు," ఆగాడు జైరాజ్.

"ఐ. సీ. కాని మిస్టర్ జైరాజ్, మీరన్నట్లుగానే మిమ్మల్ని చూడగానే నాలోనూ సంచలనం రేగింది. కాని మీలో ఏర్పడినట్లు ద్వేషాసూయలకు బదులు మీరంటే జాలి, అభిమానం ప్రేమ కల్గుతున్నాయి నాకు." అన్నాడు

ప్రవీణ్‌కుమార్ అడ్డొస్తూ.

"అదంతా అనవసరం. మర్యాదగా రేపే కాలేజీవదిలి వెళ్ళిపోతే ఇద్దరికీ మంచిది. దయచేసి ఈ జన్మలో నా కక్కనిపించవద్దు మళ్ళీ. మూరంగా ఇక్కడినుంచి వెళ్ళక పోతే తగిన ప్రతిఫలాన్ని అనుభవిస్తారు. ఇకపై మీమీది ద్వేషాన్ని అణుచుకొనే శక్తి నాకులేదు. ఈ కాస్త సమయంలోనే మిమ్మల్ని చూసి భరించలేని నేను ప్రతీరోజూ మిమ్మల్ని చూస్తూ నాలోని ద్వేషాన్ని అణుచుకోవడమనేది అసంభవం. వివేకవంతంగా ప్రవర్తి స్తారని ఆశిస్తాను. గుడ్‌బై." అనేసి విసురుగా బైటకు వెళ్ళిపోయాడు జైరాజ్.

జైరాజ్ వింతప్రవర్తన ప్రవీణ్‌కుమార్‌కు ఆశ్చ ర్యాన్ని, ఆసక్తినీ కల్గించింది. ఆలోచిస్తూ అతను వెళ్ళిన వైపే చూస్తూ కాలేజ్‌నుంచి వెళ్ళకుండానే జైరాజ్ సంగ తేమిటో తేల్చుకోవాలనే నిశ్చయానికొచ్చాడు.

మరో రెండునిముషాల్లో అతను కూడా బైటకొచ్చా డు.

# 3

వారం రోజులు గడిచాయి.

బీచ్‌లో కూర్చొన్న ప్రవీణ్‌కుమార్ వాచ్ చూసు కొన్నాడు. గంట ఆరయింది. లేచినిలబడి ఫాంట్‌కు అంటుకొన్న ఇసుక దులుపుకొని ముందుకు నడిచాడు.

ఒకవైపు సూర్యుడస్తమిస్తోంటే మరోవైపు చీకటి తెరలు ముసురుకొంటున్నాయి.

బీచ్‌లో అప్పటివరకూ కూర్చొన్న జంటలు ఇళ్ళకు బైలుదేరాయి. పనేమీ లేకపోవడం వల్ల ఎక్కడ

కెళ్ళాలో తోచలేదు ప్రవీణ్‌కుమార్‌కు.

సినిమాకు పోదామనిపించి ముందుకు కదిలాడు.

ప్రవీణ్‌కుమార్ థియేటర్ చేరేటప్పటికి బిగిన్ అయిందికాబోలు బైట తిరుగుతున్న జనం కంగారుగా లోనికి పరుగిడుతున్నారు.

బుకింగ్‌లో టికట్ తీసుకొని లోనికి వెళ్ళాడు. అతను సీట్లో కూర్చొనేప్పటికి పూర్తయింది ఇండియన్ న్యూస్ రివ్యూ. రిలీఫ్‌గా నిట్టూర్చాడు బోరింగ్ తప్పినందుకు.

ఇంటర్వెల్ అయింది. రిచర్డ్ బర్టన్ క్లింట్ ఈస్టఉడ్ లను తలచుకొంటూ బైటకు వచ్చాడు.

కేంటీన్‌లో కెళ్ళి కాఫీ తీసుకొంటున్న ప్రవీణ్‌కుమార్ ఉలిక్కిపడ్డాడు. దూరంగా నిలబడి తనవైపే చూస్తూ ఎవరితోనో మాట్లాడుతున్న జైరాజ్‌ను చూడగానే.

ప్రవీణ్‌కుమార్ తనవైపు చూడగానే ముఖం త్రిప్పుకొన్నాడు జైరాజ్ కాని అతనిపక్కనే నిలబడి మాట్లాడుతున్న ఇద్దరూ మాత్రం తనవైపు ఆదోలా చూస్తున్నారు.

తనవైపు చూడకపోయినా జైరాజ్ ఆ యిద్దరకూ తన గురించే ఏదో చెపుతున్నారని అర్థమైంది ప్రవీణ్‌కుమార్‌కు. ఖాళీకప్పును డస్టబిన్‌లో పడేసి లోనికి వెళ్ళిపోయాడు ప్రవీణ్‌కుమార్.

రాత్రి పదిగంటలకు థియేటర్ నుంచి ఆఖరుగా బైట కొచ్చాడు ప్రవీణ్‌కుమార్. హుషారుగా ఈలవేసూ నడవ సాగాడు. వారంరోజుల క్రితం జైరాజ్ పలికిన మాటలు గుర్తుకొచ్చి నవ్వుకొన్నాడు ప్రవీణ్‌కుమార్.

రోజూ కాలేజీలో అతని ప్రవర్తనను పరిశీలించేవాడు తను. తనని చూడగానే అతని వదనంలో కోపఛాయలు

స్పష్టంగా కన్పించేవి. చాలావరకూ క్రోపాన్ని అణుచుకో డానికి ప్రయత్నించేవాడు సాధ్యమైనంత వరకూ తన నుంచి తప్పుకొనేవాడు అటువంటివాడు ఈరోజు తన గురించి వాళ్ళతో ఏమిటి చెబుతున్నాడు?

ఆలోచిస్తూ నడుస్తున్న ప్రవీణ్‌కుమార్ త్రుళ్ళిపడి ఆగిపోయాడు.

రోడుకి అడ్డంగా ఇద్దరు నిలబడి తనవైపే చూస్తు న్నారు వెనక్కితిరిగి చూశాడు ప్రవీణ్‌కుమార్. మరో ఇద్దరు బాక్ చేసారక్కడ.

ఆశ్చర్యంగా చూశాడు వాళ్ళవైపు "ఎవరు వీళ్ళు? ఎందుకు తననిలా అటకాయించారు?" అర్థం కాలేదు ప్రవీణ్‌కుమార్.

ఆ వీధిలో ఎలక్ట్రిక్ పోల్స్‌కు లైట్స్ లేకపోవటం వలన చీకటిగా నిర్మానుష్యంగా ఉంది ముఖాలు సరిగా కన్పించటంలేదు.

"ఎవరు మీరు? ఎందుకు నన్నిలా..." ఆశ్చ ర్యంగా అడగబోతున్న ప్రవీణ్‌కుమార్ మాటలు పూర్తి కాకముందే ఎదురుగా నిలబడ్డ ఇద్దరిలో ఒకడు మెరుపులా ముందు కడుగువేసి, పిడికిలి బిగించి ప్రవీణ్‌కుమార్ పొట్టలో గుద్దాడు.

నరాలు తెగి ప్రేవులు కదిలినంత బాధ కల్గింది ప్రవీణ్‌కుమార్‌కు. తేరుకొనేలోగా ప్రక్కనున్నవాడు గడ్డంక్రింద కొట్టాడు. కరంట్ షాక్‌లా తగిలింది. ఎగిరి నేలకరచుకొన్నాడు ప్రవీణ్.

నెమ్మదిగా లేవబోయాడు. మరుక్షణంలోనే వెనక నున్నతని బూట్‌కాలు విసురుగా నడుం తాకింది. చక చకా

మరో నాలుగు తన్నులు తన్ని ఎలావచ్చారో అలాగే మాయమయ్యారు ఆ నలుగురూ.

నీరసంగా లేచి నిల్చున్నాడు ప్రవీణ్‌కుమార్. మోకాలు కలుక్కుమంది. అయినా బాధను సహిస్తూలేచి నిలబడి గోడనానుకొని రెండు నిముషాలు అలుపు తీర్చుకొన్నాడు.

బట్టలు చిరిగిపోయాయి. అక్కడక్కడా శరీరం కొట్టుకుపోయి చుర చురా మండుతోంది.

కసిగా పళ్ళు కొరుక్కున్నాడు ప్రవీణ్‌కుమార్. వాళ్లెవరో ఎలాగయినా తెలుసుకొని ఎముకలు విరగ గొట్టాలన్పించింది.

తూలుతూ ముందుకు నడిచాడు వాళ్ళ గురించే ఆలో చిస్తూ అప్పుడు గుర్తొచ్చారు థియేటర్లో కన్పించిన జైరాజ్ స్నేహితులు.

# 4

క్లాస్‌లోకి అడుగు పెట్టాడు ప్రవీణ్‌కుమార్. మౌనంగా వెళ్ళి తన సీట్లో కూర్చొన్నాడు. తలెత్తి చూడగానే ప్రక్క బెంచ్‌లో కూర్చొని తనవైపే చూస్తున్న జైరాజ్ కన్పించాడు.

కోపంగా పిడికిలి బిగించాడు ప్రవీణ్. రాత్రి తగిలిన దెబ్బల తాలూకు నెప్పులు ఇంకా తగ్గలేదు. దవడలు బిగించి పళ్ళు కొరుకొన్నాడు.

"వెధవలు! అనవసరంగా తనని రెచ్చగొట్టారు. మంచిగా వదిలేస్తే చాతకాని వాడిలా చూస్తారు. గట్టిగా బుద్ధి చెప్పాలి," గుణుక్కొన్నాడు ప్రవీణ్‌కుమార్.

కామర్స్ హెడ్ ఎకౌంట్స్ మొదలెట్టాడు. ఎకౌంట్ బుక్ తీసి ప్రోబ్లమ్ చేయసాగాడు ప్రవీణ్‌కుమార్.

పావుగంట గడిచింది. ఇంకో పావుగంటలో క్లాసయి పోతుంది. చకచకా చెప్పుకుపోతున్నాడు కామర్స్ హెడ్ తన గంభీర కంఠంతో.

"ఎక్స్‌క్యూజ్‌మీ సర్ !"

ఆగిపోయాడు లెక్చరరు. అతని వాక్ ప్రవాహానికి అడ్డుపడింది.

"వాట్ హాపెండ్ మైడాటర్?" అడిగాడు వక చేతితో తన బట్ట తల సవరించుకొంటు ముందు సీట్లో కూర్చొన్న మిస్ హేలవైపు చూసి.

"యస్. సర్ ! వెనక నుంచెవరో ఈ రాళ్లతో మమ్మల్ని కొడుతున్నారు సర్ !" ముందుకువచ్చి చేతి లోని గులకరాళ్ళను టేబిల్‌పై పెడుతూ అంది హేల.

ఒకసారి వాటినిచూసి స్టూడెంట్స్ వైపు దృష్టి సారించాడు కామర్సుహెడ్.

"హూ ఈజ్ దట్ ఈడియట్ ?" కోపంగా గర్జించాడు.

ఎవరూ మాట్లాడలేదు.

మరలా అడిగాడు. ఎవరూ సమాధానం చెప్పకపోవటంతో రెచ్చిపోయాడు.

"రెండు నిముషాలు టైమిస్తున్నాను. మర్యాదగా రాళ్ళు విసిరిన రాస్కెల్ ఎవరో లేచి నిలబడండి. లేక పోతే క్లాసంతా సస్పెండ్ చేయిస్తా. ఎవరూ పరీక్షల కెళ్ళకుండా చేస్తా." అరిచాడు హెడ్.

రెండు నిముషాలు గడిచాయి.

ఎవరూ కదలలేదు. వాచీ చూసుకొని క్లాసంతా వకసారి చూసాడు. అంతా కళ్ళప్పగించి తనవైపే చూస్తుంద

టంతో చిరాకెత్తింది హెడ్‌కు.

"ఆల్‌రైట్! ఒకసారి సస్పెండు చేస్తేగాని మీకెవరికి బుద్ధి వచ్చేలా లేదు." అంటూ బైటకెళ్ళటానికి ఉద్యుక్తుడయాడు.

అంతలో చటుక్కున లేచి నిలబడ్డాడు జైరాజ్. కోపంగా చూసాడు జైరాజ్ వైపు హెడ్.

"రాస్కెల్! ఆడపిల్లలపై రాళ్ళిసరటానికాసీ పేరెంట్స్ నిన్నిక్కడికి పంపించింది?" అరిచాడు.

"ఎక్స్‌క్యూజ్‌మీ సర్, రాళ్ళు విసిరింది నేను కాదు. విసిరిన వారెవరో చెప్దామని నిలబడ్డాను," అన్నాడు జైరాజ్ సీరియస్‌గా.

కామర్స్‌హెడ్ చల్లబడ్డాడు.

"ఎవరతను?" అడిగాడు.

అంతా తన వైపే ఆసక్తిగా చూస్తూండటం గమనించాడు జైరాజ్.

"ఎవడా రాస్కెల్?" అసహనంగా మళ్ళీ అడిగాడు హెడ్.

"మిస్టర్ ప్రవీణ్‌కుమార్!"

"ప్రవీణ్‌కుమారా?" ఆశ్చర్యపోయాడు హెడ్. బుద్ధిమంతుడని పించుకొన్న ప్రవీణ్‌కుమార్ ఇలా ఆడపిల్లలపై రాళ్ళు విసిరాడంటే నమ్మలేక పోయాడు.

తెల్లబోతూ నిలబడ్డాడు ప్రవీణ్‌కుమార్. అతనికంతా అయోమయంగా ఉంది.

జైరాజ్? అతను రాళ్ళు విసురుతుండగాను నువ్వు చూసావా?" అనుమానంగా అడిగాడు హెడ్.

"యస్ సర్! నేనే కాదు నా స్నేహితులు కూడా

చూసారు," ధృఢంగా అన్నాడు జైరాజ్. వెంటనే అతని స్నేహితులు ఆ మాటను ధృవపరిచారు, తాముకూడా చూసామంటూ.

"వాట్ మిస్టర్ ప్రవీణ్ ? ఏమిటి నీ సంజాయిషీ ?"

అయోమయంలో కొట్టుమిట్టాడుతున్న ప్రవీణ్‌కుమార్ ఏదో చెప్పబోయాడు. కాని అతని మాటను లెక్చరర్ వినిపించుకోలేదు.

"ఆల్ రైట్, నువ్వేదో బుద్ధిమంతుడవనుకొన్నాను గాని ఇలా ఆడపిల్లలపై రాళ్ళు విసిరే రౌడీ రాస్కెల్ వనుకోలేదు.

నువ్వు చేసిన ఈ వెధవపనికి శిక్షగానిన్ను పదిహేను రోజులు కాలేజీనుంచి సస్పెండ్ చేస్తున్నాను. ఇకనువ్వు వెళ్ళొచ్చు," పుస్తకంలో తల దూర్చాడు కామర్సు హెడ్.

తల తిరిగిపోయింది ప్రవీణ్‌కుమార్‌కు. ఇంక తనేం చెప్పినా వినేటట్లులేడు హెడ్. స్టూడెంట్స్ అంతా తన వైపు జాలిగా చూస్తున్నారు. జైరాజ్‌వైపు ఒకసారి కసిగాచూసి బైటకు వెళ్ళిపోయాడు ప్రవీణ్‌కుమార్.

మరో ఐదు నిముషాలలో క్లాసయింది. కామర్సు హెడ్ బట్టతల సవరించుకొంటూ వెళ్ళిపోయాడు.

జైరాజ్ అతనిని ఫ్రెండ్సుతో కల్సి బైటకు వచ్చాడు. ప్రవీణ్‌కుమార్ వైపుచూసి పరిహాసంగా నవ్వి ముందుకు నడిచాడు.

తనచుట్టూ చేరుతున్న ఫ్రెండ్స్‌ను విదిలించుకొంటూ గబగబా వెళ్ళి నడుస్తున్న జైరాజ్ భుజంపై చేయివేసి తన వైపు త్రిప్పుకొన్నాడు ప్రవీణ్‌కుమార్.

మెరుపులా వెనక్కి తిరిగాడు జైరాజ్ అతని భుజం

పట్టుకొని వరండా మూలకు లాక్కెళ్ళాడు ప్రవీణ్ కుమార్.

"నిజం చెప్పు! నేను హేలపై రాళ్ళువిసిరినా? విసురు తుండగా నువ్వుచూసావా?" పిడుగులా అడిగాడు ప్రవీణ్ కుమార్.

"లేదు." అన్నాడు జైరాజ్ ప్రశాంతంగా. "అయితే రాళ్ళు విసిరిందెవరు?"

"నేను."

"మరి నేను విసిరానని ఎందుకొ చెప్పావ్?" కోపంగా అడిగాడు ప్రవీణ్ కుమార్.

జైరాజ్ ఒకసారి కోపంగా చూసాడు ప్రవీణ్‌ను.

"ఎందుకా? పగ! నీపై కోపం! నా మాటలు లక్ష్యె పెట్టక తగిన ప్రతిఫలాన్ని అనుభవిస్తున్నావ్." అంటూ విసురుగా వెళ్ళిపోయాడు జైరాజ్.

నివ్వెర పోయి నిలబడిపోయాడు ప్రవీణ్ కుమార్.

# 5

సాయంత్రం ఐదయింది.

సూర్యుడు పశ్చిమాద్రిని చేరుకొంటున్నాడు. ఎండలో వేడి తీక్షణత తగ్గి నులివెచ్చగా ఉన్నాయ్ కిరణాలు.

ప్రకృతి సౌందర్యానికి పరవశిస్తూ మెల్లిగా నడుస్తున్నాడు ప్రవీణ్ కుమార్. ఈవెనింగ్ వాకింగా ఆ రోజు బీచ్ రోడ్ వైపు వచ్చాడతను.

అటు, ఇటూ తిరుగుతూ చిరుతిళ్ళు అమ్మే కుర్రవాళ్ళ కేకలతో కోలాహలంగా ఉంది బీచ్.

సముద్రంపై వీచే గాలి ప్రశాంతంగా తాకుతూ మనస్సుకు హాయిని చేకూరుస్తోంది. ఆలోచిస్తూ నడుస్తున్న

ప్రవీణ్‌కుమార్ బీచ్‌ను దాటి దూరంగా వచ్చేయటం గమనించలేదు.

దాదాపు సిటీ లిమిట్స్ దాటి వచ్చేయటంవలన ఎవరూ లేక సముద్రతీరం నిర్మానుష్యంగా ఉంది. దూరంగా ఏవో పల్లెగుడిసెలు మాత్రం కన్పిస్తున్నాయి.

ఇసుకలో దిగి కొంతదూరం నడిచి ఒకచోట కూర్చొన్నాడు ప్రవీణ్‌కుమార్. చుట్టూ మసకచీకట్లు క్రమ్ముకొంటున్నాయి.

సముద్రం హోరెక్కువయి విపరీతంగా ఘోష పెడుతోంది. రోడ్డమ్మట అరగంటకో కారు వెళ్ళటం వలన మిగిలిన సమయాలలో నిశబ్దం దట్టంగా ఆవరించుకొని ఉంది.

జైరాజ్ గుర్తొచ్చాడు ప్రవీణ్‌కుమార్‌కు. కోపంగా తిట్టుకొన్నాడు. వారం రోజులుగా కాలేజీకి వెళ్ళక బోర్ కొడుతోంది. తనపై అతను ఎందుకు పగబూనాడో ఎంత ఆలోచించినా అర్థంకాలేదు ప్రవీణ్‌కు.

గంట గడిచింది.

జరిగిన సంఘటనలను గుర్తుకు తెచ్చుకొని జైరాజ్‌ను తల్చుకొంటూ నిటూర్చాడు ప్రవీణ్‌కుమార్.

చీకట్లు బాగా ముసురుకొన్నాయ్. పల్లెవాళ్ళ కొంపల్లో దీపాలు వెలిగాయ్.

లేచినిలబడి బట్టలకంటుకొన్న ఇసుక దులుపుకొని ముందుకు కదిలాడు టార్చ్ వెలిగిస్తూ.

కొంచెం దూరం వెళ్ళగానే 'కెవ్వ' మంటూ కేక విన్పించింది.

ఠక్కున ఆగి నలుదిశలా పరిశీలించి చూశాడు. తీరం

పొడుగునా సరుగుడు తోటలున్నాయి. చెట్ల వెనకనుండి ఆకాశంలోకి ఎగబ్రాకుతున్నాడు చంద్రుడు ప్రకాశిస్తూ.

రెండు నిముషాలు గడిచాయి. నిలబడి చుటూ చూస్తూన్న ప్రవీణ్‌కుమార్‌కు విసుగెత్తింది. భ్రమేమో ననుకొంటూ ముందుకు కదలబోయాడు.

అంతలో మళ్ళీ విన్పించిందా ఆర్తనాదం. స్త్రీ ఆర్తనాదం. స్పష్టంగా విన్పించింది సరుగుడుతోటలోనుంచి.

నిలబడలేకపోయాడు ప్రవీణ్‌కుమార్. చెట్లవైపు పరిగెత్తి తోటలో జొరబడ్డాడు.

చంద్రకాంతి చెట్లమధ్యనుంచి దారిచేసుకొంటూ ఇసుకను చేరి ప్రతిఫలిస్తోంది.

పరిగెడుతున్న ప్రవీణ్‌కుమార్ చటుక్కున ఆగిపోయాడు. ఎదురుగా కన్పిస్తోన్న దృశ్యాన్ని చూడగానే అతని పిడికిళ్ళు కోపంతో బిగుసుకొన్నాయి. చెట్లమధ్య విశాలమైన ప్రదేశంలో ఓ అమ్మాయిచుట్టూ నిలబడి నవ్వుతున్నారు నలుగురు. వాలకం చూస్తే స్టూడెంట్స్‌లాగున్నారు.

అర్థమైంది ప్రవీణ్‌కుమార్‌కు. వాళ్ళవైపు పరిశీలనగా చూస్తూ రెండడుగులు ముందుకేసాడు. చంద్రకాంతివలన వాళ్ళనీడలు ఇసుకలో మూడురెట్లు పెద్దవి పడుతున్నాయి.

నలుగురివైపు పరిశీలనగా చూస్తున్న ప్రవీణ్‌కుమార్ ఉలిక్కిపడ్డాడు. అతనిదృష్టి ఒక వ్యక్తిపై నిలిచిపోయింది.

వారం రోజులక్రితం తిన్న తన్నులు గుర్తుకొచ్చాయి ప్రవీణ్‌కుమార్‌కు. మరుక్షణమే ధియేటర్లో జైరాజ్‌తో మాట్లాడుతూ అతను తనవైపు చూసిన చూపులు కూడా

గుర్తుకొచ్చాయి.

కోపంతో పళ్ళు కొరుక్కున్నాడు ప్రవీణ్‌కుమార్. రక్తం నరాల్లో వరవడిగా పరుగులు తీసింది.

రాస్కెల్స్ ఆనాడు చీకటిలో అకస్మాత్తుగా దాడి చేసి తన్నినందుకు బదులు తీర్చుకోవాలి, అనుకొంటూ వాళ్ళవైపు కదిలాడు.

అడుగుల చప్పుడు విని తృళ్ళిపడ్డారు నలుగురూ. అనుమానంగా చుట్టూ చూసారు.

సరుగుడుచెట్ల వెనకనుంచి తమవైపు వస్తున్న ప్రవీణ్ కుమార్‌పై నిలిచిపోయింది వారిదృష్టి.

ఎదురుగా వచ్చి నిలబడ్డాడు ప్రవీణ్. ముఖాముఖాలు చూసుకొన్నారు నలుగురూ.

"నువ్వా?" అన్నాడు ఒకడు బలవంతంగా గొంతు పెకలించుకొని.

"అవును, నేనే! మర్యాదగా ఆ అమ్మాయిని వదితే యండి," కోపంగా అన్నాడు ప్రవీణ్.

అంతవరకూ భయంతో వణికిపోతూ నిలబడ్డ ఆ యువతి పరిగెత్తుకువెళ్ళి ప్రవీణ్‌కుమార్ వెనక నక్కింది.

"వదలకపోతే?" ఆదోలా అన్నాడు మరొకడు.

నవ్వాడు ప్రవీణ్‌కుమార్. "అర్థంలేని ప్రశ్న! నేనే తీసుకెళ్తాను వెంటబెట్టుకొని."

"మొన్న తన్నిన తన్నులకింకా బుద్ధిరాలేదు కాబోలు!" అంటూ మెరుపులా ముందుకు దూకాడు ఒకడు.

సందేహం తీరిపోయింది ప్రవీణ్‌కుమార్‌కు, ఆ రాత్రి తనపై చేయిచేసుకొన్న నలుగురూ వీళ్ళేనని.

అప్పటివరకూ గుప్పెటలో ఉన్న ఇసుక వాడి

ముఖంపై కొట్టాడు ప్రవీణ్‌కుమార్. వాడికళ్ళు భగ్గు మన్నాయ్. ఆలశ్యంచేయకుండా పిడికిలి బిగించి వాడి గడ్డంక్రింద గుద్దాడు. ఎగిరి ఇసుకలో పడ్డాడు వాడు.

మరుక్షణమే నివ్వెరబోయి చూస్తున్న మిగిలిన ముగ్గురి పైకి లంఘించాడు ప్రవీణ్‌కుమార్. అతని పిడికిలి రైలింజన్ రాడ్‌కంటే వేగంగా పనిచేసింది. వాళ్ళ కళ్ళ ముందు రంగులు కదిలాయ్.

"రాస్కెల్స్ ప్రమత్తుడై వస్తున్న వ్యక్తిపై ఆకస్మిక దాడి జరిపి నాలుగు తన్నడం గొప్పకాదు. ఇదీ గొప్ప దనం," అంటూ మరోనాలుగు గుద్దులుగుద్దాడు కసిగా.

ప్రతిఘటించే శక్తిలేక నిస్సహాయంగా కూలిపోయారు ముగ్గురూ.

గట్టిగా వళ్ళు విరుచుకొని వెనక్కి తిరిగాడు ప్రవీణ్ కుమార్. ఆ యువతి కన్పించకపోవటంతో క్షణకాలం కంగారుపడ్డాడు. క్రిందనున్న టార్చ్ తీసికొని వెతుకు కొంటూ సరుగుడుతోట బైటకొచ్చాడు.

దూరంగా రోడ్‌మీద సిటీవైపు పరుగులేస్తున్న ఆ అమ్మాయిని చూడగానే నవ్వొచ్చిందతనికి. హుషారుగా ముందుకు కదిలాడు.

# 6

మరోరెండు నెలలు సాఫీగా గడిచాయి.

కాలేజ్ ప్రారంభించబడిన అరగంటకు నోటీస్ కాగి తాన్ని పట్టుకొని లోపలకొచ్చాడు ప్యూన్. లెక్చరర్ నోటీస్ ఓసారి పూర్తిగాచదివి, సంతకం పెట్టి, విషయం చెప్పసాగాడు.

యన్.సి.సి. కాడేట్స్ అంతా మేజర్ అజిత్‌సింగ్

గారిని సాయంత్రం ఓసారి కల్సుకోవాలి. అండర్ ఆఫీసర్ ప్రవీణ్‌కుమార్ ఇప్పుడు మేజిక్‌గార్ని అర్జంటుగా మీటవ్వాలట ......"

లేచినిలబడ్డాడు ప్రవీణ్‌కుమార్.

"మిస్టర్, యు ఆర్ అండర్ ఆఫీసర్?"

"యస్ సర్"

"వెరీగుడ్... నౌయు కెన్ గో,"

బైటకు కదిలాడు ప్రవీణ్.

ఐదునిముషాలలో యన్.సి.సి. క్వార్టర్స్ చేరుకొన్నాడు.

కాలేజి బిల్డింగ్‌కు కొంచెం దూరంలో ఉంది చుట్టూ చింతచెట్లతో ఎప్పుడూ చల్లగా ఉంటుందా ప్రదేశం. యన్. సి. సి. గార్డ్స్ చెట్లక్రింద నీరు మరగబెట్టి 'పుల్‌త్రూ'లతో రైఫిల్ గొట్టాలు క్లీన్ చేస్తున్నారు.

ఆఫీస్ రూంలోకి వెళ్ళాడు ప్రవీణ్. ఫైళ్ళు చూస్తున్న మేజరు బూట్లశబ్దం విని తలెత్తి చూడగానే అటెన్షన్‌లో నిలబడి సెల్యూట్ చేసాడు.

"టేక్ యువర్ సీట్ మిస్టరు ప్రవీణ్."

"థాంక్యూ సర్" యిర్చొన్నాడు.

"యస్ మిష్టరు ప్రవీణ్‌కుమార్, ఈ సంవత్సరం మన యన్.సి.సి. కాంప్ ఉదయపూరు ఔట్‌స్కర్ట్‌లో ఇవ్వబడింది. పదిహేను రోజులు కాంప్. వచ్చే శనివారం బయలు దేరాలి. కాడెంట్లందర్నీ సిద్ధపరుచు," అన్నాడు మేజర్ అజిత్‌సింగ్.

"ఉదయపూర్?" ఉలిక్కిపడ్డాడు ప్రవీణ్‌కుమార్.

"ఎక్స్యూజ్‌మి సర్. ఉదయపూర్ రాజస్తాన్ స్టేట్

లోనిది కదూ?"

"యస్ నీవెప్పుడన్నా ఉదయపూర్ వెళ్ళావా?"

సమాధానం చెప్పలేదు ప్రవీణ్‌కుమార్. అతని మనసులో ఆరవెల్లి కొండలు మెదులుతున్నాయ్. ఆలోచిస్తూ ఉండిపోయాడు

"వాట్ మిస్టర్ ప్రవీణ్, ఏమిటి ఆలోచిస్తూ ఉండిపోయావ్?" అడిగాడు మేజర్.

"ఏమీలేదు సర్." కుర్చీలోంచి లేచాడు.

"వెంటనే అన్నీ ఏర్పాట్లూ చెయ్యి. విష్యు గుడ్ లక్." అన్నాడు మేజర్ తనూ కుర్చీలోంచి లేస్తూ.

అటెంషన్‌లో నిలబడి సెల్యూట్ చేసి బైటకొచ్చాడు ప్రవీణ్‌కుమార్.

అతని మనసంతా వికలంగాఉంది. ఏవేవో గత స్మృతుల తాకిడికి గురవుతోందతని హృదయం. వాటిలో కెల్లా ముఖ్యపాత్ర వహించినవి ఆరవెల్లి కొండలు. వాటి ఆకారాలు అతని కళ్ళముందు గోచరిస్తున్నాయ్.

భరించలేనట్లుగా తలవిదిల్చి కాలేజీవైపు కదిలాడు.

# 7

రాజస్థాన్‌లోని ప్రాచీన పట్టణాలలో ఒకటైన ఉదయపూరు నాటి నాగరికతకు తార్కాణంగా నిల్చిన పట్లణం. దానికి నిదర్శనంగా నేటికీ చెక్కుచెదరకుండా నిల్చి ఉన్న మహారాజ వైభవం, కోటలు, రాతి కట్టడాలు రుజువు చేస్తున్నాయ్.

ఉదయపూర్‌కు నలభై మైళ్ళ దూరంలో ఉన్న ఒచిన్న గ్రామ పరిసరాలలో క్యాంప్ చేసింది యన్.సి.సి బెటాలియన్.

టార్పాలిన్స్‌తో గుడారాలు నిర్మించారు కాడెట్స్. అన్ని పనులు పూర్తిచేసిన తర్వాత మేజర్ అజిత్‌సింగ్ అనుమతితో గ్రామంలోకి బయలు దేరారంతా సరదాగా. మేజరు అజిత్‌సింగ్ కాక మరో నలుగురు ఇన్‌స్ట్రక్టర్స్ మాత్రం కాంప్‌లో ఉండిపోయారు.

ఇసుక ప్రదేశమవటం వలన ఉదయం తొమ్మిది గంటలకే వాతావరణం వేడెక్కుతోంది. ఎక్కడచూసినా గుర్రాలు, ఒంటెలు కన్పిస్తున్నాయి.

అందరితో కలిసి గ్రామంలోకి నడిచాడు ప్రవీణ్ కుమార్. దూరంగా జైరాజ్ ఒక్కడే నడుస్తున్నాడు.

ఉదయపూర్‌లో అడుగు పెట్టినప్పటినుంచీ అతనిలో భావాలు మారటం గమనించాడు ప్రవీణ్‌కుమార్. సంఘర్షణ ఏదో అతనిలో జరుగుతోందని స్పష్టంగా తెలియజేస్తోంది అతని వదనం.

సరదాగా కబుర్లు చెప్పుకొంటూ గ్రామంలోకొస్తున్న కాడెట్లందరివైపు ఆశ్చర్యంగా చూస్తున్నారు ప్రజలు. ఎరుపురంగు కల్గి ధృఢంగా ఎత్తుగా ఉన్న రాజస్థానీయులు ఎంతో ఆకర్షణీయంగా ఉన్నారు. తలపై ఉన్న తెల్లటి పాగాలు చూడటానికి వింతగా ఉన్నాయ్.

అటూ ఇటూ పరుగులు తీస్తున్న అశ్వాలు, అక్కడి వాతావరణం చూస్తోంటే కౌబాయ్ పిక్చర్స్ జ్ఞాపకం వచ్చాయ్ ప్రవీణ్‌కుమార్‌కు.

గ్రామందాకా కలసికట్టుగావచ్చిన స్టూడెంట్స్ అంతా తలో వైపుకు విడిపోయారు.

ఆలోచిస్తూ నడుస్తున్న ప్రవీణ్‌కుమార్ గ్రామందాటి అవలి పొలిమెరలు చేరుకున్నాడు. అక్కడక్కడ

చెదురు మదురుగా గుడిసెలు కన్పిస్తున్నాయ్. అంతా ఒకసారి పరిశీలనగా చూసి వెనక్కి తిరగబోతూ తృళ్ళి పడ్డాడు.

అతని చూపు దూరంగా ఇసుకలో ఉన్న పొడుగైన రాతి స్తంభంలాంటి దానిపై నిల్చింది. బాగా ఎత్తుగా ఉండి కొంచెం ప్రక్కకి వరిగినట్లుగా కన్పిస్తోందది.

దానివైపు పరుగుతీసాడు. దగ్గర చేరుకొని దానినే పరీక్షగా చూస్తూన్న ప్రవీణ్‌కుమార్‌ను వళ్ళంతా చెమటలు పట్టాయ్. నరాలలో రక్తం వడివడిగా పరుగులు తీసింది.

అతని కళ్ళముందు చీకట్లు క్రమ్ముతోంటే ఆ చీకటిలో ఏవేవో మరచిపోయిన గతస్మృతులు తిరుగాడ సాగాయ్.

# 8

సుమారు ఇరవై సంవత్సరాలక్రితం. ఓ రోజు ఉదయం ఐదు గంటలు కావస్తోంది. తూర్పు దిక్కున ఆకాశం తెల్లటి మసక వెల్తురు క్రమ్ముకొంటోంది.

వేగంగా దూసుకువచ్చిన రెండు అశ్వాలు ఎత్తైన ఆ స్థంభం ముందాగాయ్. చాలాదూరంనుంచి ఆగకుండా ప్రయాణంచేసినట్లు తెలుపుతూ అశ్వాలు రెండూ ఆయాసంతో నురుగులు క్రక్కుతున్నాయ్.

వాటిపైనుంచి క్రిందకు దూకారు అజిత్, ప్రతాప్‌లు. ఆ ఎత్తైన రాతిస్థంభంవైపు నడిచారు.

"ఇదేనేమో మాప్ చూడు ప్రతాప్" అన్నాడు అజిత్.

బలంగా ఎత్తుగాఉన్నారిద్దరూ. దళసరి ఉన్నికోట్లు వారి శరీరాలను కప్పుతున్నాయ్. నడుముచుట్టూ ఆ ఉన్ని

కోట్లను బిగిస్తూ తూటాలబెల్టు ఉంది. దానికి వ్రేళ్ళాడుతూ లెదర్ కేస్‌లో రివాల్వర్ ఉంది. చేతికో రైఫిల్స్ ఏ క్షణంలోనైనా ప్రేలే పొజిషన్‌లో ఉన్నాయ్.

కోటుజేబులోంచి మాప్ బైటకు తీశాడు ప్రతాప్. సగమే ఉందాంట్లో. రెండవ సగమున్న మాప్‌ను అజిత్ నుంచి తీసుకొని దగ్గరగా చేసి చూసాడు. అతని ముఖం వికసించింది. సంతోషంతో గట్టిగా అరిచి అజిత్‌ను కౌగలించుకొన్నాడు.

అరగంటతర్వాత తిరిగి అశ్వాలు రెండూ ఆ ఇద్దరితో కల్సి వేగంగా ఆ రాతి స్తంభానికి తూర్పుదిక్కుగా సాగి పోయాయి.

వారి కళ్ళముందు మాప్ ప్రతిరూపం కదలాడుతోంది. మరో ముప్పై మైళ్ళు పోతే అర్ధచంద్రాకారపు రాతిశిలలు తగులుతాయ్. అది రెండవ గుర్తు. అక్కడనుంచి దక్షిణం వైపు ప్రయాణం.

సుమారు రెండుగంటలు గడిచాయ్. సూర్యుడు ఆకాశంలో ఎగబ్రాకాడు. నులివెచ్చని సూర్యుని కిరణాలు తీక్షణంగా మారాయి.

దూరంగా అర్ధచంద్రాకారపు శిలలు కన్పించగానే హుషారుగా అశ్వాలను అదిలించారిద్దరూ. మాప్‌లో గుర్తించినట్లే ఉన్నాయవి.

"రెండవ గుర్తు!" అన్నాడు ప్రతాప్.

'ఇంకో రెండు దాటాలి. ఆపైన ఆరవెల్లి కొండలు. ఆ కొండలలోనే ఉంది రెండు తరాల క్రితం అంతరించి పోయిన ఉదయపూర్ మహారాజ్‌గారి వంశపారంపర్యంగా స్తున్న నిధి' అనుకొన్నాడు అజిత్.

ఉదయపూర్ మహారాజుగారి కాలంలో దివాణంలో ఆయనకు నమ్మకమైన ఉద్యోగులుగా ఉంటూ, ఆయన అనుమతితో ఈ నిధి రహస్యాన్ని తమకు మాప్‌రూపంలో అందజేసిన, తమ తాతలకు మనస్సులోనే కృతజ్ఞతలు అందజేసుకొన్నారు ఇద్దరూ.

"ఇదే వేగంతో ప్రయాణం చేస్తే త్వరలోనే గమ్యం చేరుకోవచ్చు!" అన్నాడు ప్రతాప్ గుర్రాన్ని అధిరోహిస్తూ. అజిత్ మాట్లాడకుండా అతన్ని అనుసరించాడు.

మధ్యాహ్నానికల్లా మిగిలిన రెండు గుర్తులనూ దాటేశారు. దూరంగా ఆరవెల్లి కొండలు కన్పించసాగాయ్. వేగంగా పరుగులుతీస్తున్న అశ్వాల గిట్టల తాకిడికి ఇసుక గాల్లోకి ఎగురుతోంది. ఎటుచూసినా చిన్నచిన్న రాళ్ళ గుట్టలు.

ముందుకు కదులుతున్న అజిత్‌కు ఒకచోట పర్వత పీఠంనుంచి లోనికి అశ్వంపట్టేంతటి ఇరుకైన మార్గం కన్పించింది. వెనక వస్తున్న ప్రతాప్‌ను పిల్చి ఆ మార్గాన్ని చూపించాడు

మాప్ చూసి అదేనని తెలియగానే లోనికి చొరబడ్డారిద్దరూ తమ అశ్వాలతో. మొదట్లో పర్వతపు గోడలు ఇరుప్రక్కలా వరుసుకొన్నా రానురాను మారం విశాలమై ప్రయాణానికి అనువుగా మారింది. పావుగంట అనంతరం అవతలివైపుకు బైటపడ్డారిద్దరూ.

నలువైపులా కొండలు ఆవరించి ఉన్నాయ్. మధ్యలో ఇసుక. అక్కడక్కడ రాతిగుట్టలు. అన్నిటికన్నా ఎత్తుగా చిన్నసైజు కొండలా ఉన్న రాతిగుట్టను చూడగానే ఆనందంతో వళ్ళు పులకరించిందిద్దరికి. అక్కడకు

చేరుకోడానికి ఎక్కువ సమయం పట్టలేదు.

చేతిలోని తాడును గిరగిరా తిప్పి పైకి విసిరాడు అజిత్. రాతికితగిలి ఖంగుమంటూ శబ్దంచేసింది కొక్కెం. నాలుగైదుసార్లు గట్టిగా విదిల్చి చూసి పట్టుచిక్కిందన్న నమ్మకం ఏర్పడ్డాక తాడు సహాయంతో కొండపైకి చేరుకొన్నారిద్దరూ.

ఎదురుగా సొరంగం. లోనికి నడిచారు.

చాలా చిన్నసొరంగం అది. చుట్టూ చూసిన ప్రతాప్‌కు మార్గం కన్పించలేదు. అయోమయంగా చూసాడు అజిత్. ప్రతాప్‌కు ఏదో అనుమానం వచ్చింది.

రాతిగోడ దగ్గరకు నడిచి జాగ్రత్తగా తడమటం ప్రారంభించాడు. కాస్సేపటికి అతని ప్రయత్నం ఫలించి నట్లు ఒకచోట చిన్న రాతిపలక ప్రక్కకు జరిగింది. లోనికి మెట్లు కనిపించాయ్.

జాగ్రత్తగా దిగారు లోనికి. కటికచీకటిని ఛేదిస్తూ సన్నటి వెలుగు. వెలుగువస్తున్నవైపు వెళ్ళగానే ఒక్కసారి కళ్ళు జిగేలుమన్నాయి ఇద్దరకూ.

ఆ గుహలో గోడల నిండా అమర్చబడిన మణుల కాంతికి ఇద్దరి కళ్ళూ తట్టుకోలేక రెప రెపలాడాయ్.

ఆ కాంతిలో గుట్టలు గుట్టలుగా పోసి ఉన్న వజ్రాలు, మణులు, బంగారు కడ్డీలు కన్పించాయి. చూస్తోంటే మతి పోతోంది ఇద్దరకూ.

తాము కలలో కూడా ఊహించలేనంత సంపద, వెయ్యి తరాల పాటు కూర్చుని తిన్నా తరగనంత నిధి. అంత ధనాన్ని చూసి ఒక్క క్షణం చలించిన అజిత్ మనస్సు అత్యాశకులోనయింది.

అతని వైపే చూస్తున్న ప్రతాప్ అజిత్ చెయ్యి రివాల్వర్ పై పాకడంతో మెరుపులా ప్రక్కకు దూకుతూ రివాల్వర్ బయటకు లాగాడు. ధన్‌మంట రివాల్వర్ బుల్లెట్ అజిత్ గుండెల్లో దిగబడింది.

కూలిపోతూ ట్రిగ్గర్ నొక్కాడు అజిత్. బుల్లెట్ మిస్ అయి కప్పుకు తగిలింది. మరు క్షణంలోనే సొరంగం పైభాగం ద్వారాన్ని మూసేస్తూ అడ్డంగా కూలిపోయింది.

అదిరి పడ్డాడు ప్రతాప్. కంగారుగా ద్వారం వైపు పరిగెత్తాడు కాని ఫలితం లేకపోయింది. ఒక్క క్షణం అతని కళ్ళలో చావు భయం కదులాడింది. అజిత్ వైపు చూసాడు.

గుండె పట్టుకొని బాధతో మెలికలు తిరుగుతున్న అజిత్ పెదవు పై కసితో కూడిన చిన్న నవ్వుకదులాడింది. ప్రతాప్ వైపు క్రూరంగా చూస్తూ ఏదో అనబోయాడు కాని అతని పెదవులు విడిపడలేదు.

తల వాల్చేశాడు అజిత్.

ప్రతాప్ గుండెల్లో గుర్రాలు పరిగెత్తాయ్ అంతకు ముందు హృదయాన్ని ఆనందంతో జోలలాడించిన నిధి ఇప్పుడు కళ్ళముందు మృత్యుదేవతలా కదూలాడుతోంది.

ఎదురుగా అజిత్ శవం.

గుహలో తను బందీ

జీవ సమాధి అయిపోయినట్లనిపించింది ప్రతాప్‌కు అతి త్వరలోనే తిండీ, నీరూ లేక మల మలా మాడి చస్తాననే విషయం స్ఫురణకు రాగానే భయంతో గుండె ఆగి కుప్పలా కూలిపోయాడు.

# 9

"ప్రతాప్" అన్న అరుపు విన్పించి ఉలిక్కిపడి అటు చూశాడు ప్రవీణ్‌కుమార్.

ఎదురుగా జైరాజు నిలబడి ఉన్నాడు. ఆ వేశంతో ఊగిపోతూ "జైరాజ్

"కాదు. అజిత్‌ను,' గర్జించాడు జైరాజ్

"అజిత్'......?

"అవును. మిత్రుడిగా ఉంటూ నువ్వు చేసిన మోసానికి బలైపోయిన అజిత్‌నే."

"షటప్, ఎవరిది మోసం? నా ప్రాణాలు కాపాడుకోడానికి నిన్ను చంపాను, తప్పా?" అరిచాడు ప్రవీణకుమార్ కోపంగా.

"రాస్కెల్...ఆ నాటి కసి ఈ నాడు తీర్చుకొంటాను నిన్ను చంపి ఆ నిధిని మిళ్ళీ స్వాధీన పర్చుకొంటాను." దూకాడు జైరాజ్ ప్రవీణ్‌కుమార్ పైకి.

ఎగిరి దూరంగా పడ్డాడు ప్రవీణకుమార్ లేచేలోగా తిరిగి గుండెలపై బలంగా తన్నాడు జైరాజ్.

ఒక్క క్షణం కళ్ళ ముందు ఏమీ కన్పించలేదు ప్రవీణ్‌కుమార్‌కు, మరు క్షణమే తేరుకొన్న అతను. మీదకు వస్తోన్న బూట్ కాలును పట్టుకొని మెరుపులా మెలి తిప్పాడు.

బాధగా కేకేసాడు జైరాజ్. రెండో కాలు పట్టు తప్పటంతో క్రింద పడ్డాడు. చటుక్కున లేచి నిలబడ్డాడు ప్రవీణకుమార్. కాలికున్న యన్. సి. సి. బూటుతో ఎడా పెడా తన్నడం ప్రారంభించాడు.

భాధతో ఉక్కిరి బిక్కిరయ్యాడు జైరాజ్. అతని

ముఖం రక్త సిక్తంగా మారింది. అతని నడుము చుట్టూ ఉన్న యన్. సి. సి. బెల్ట్ పట్టుకొని పైకి లేపి పొట్టలో గుద్దాడు ప్రవీణకుమార్. దూరంగా వెళ్ళి పడాడు జైరాజ్, స్పృహలేకుండా.

అతని వైపోసారి చూసి వేగంగా గ్రామంలోకి కదిలాడు ప్రవీణకుమార్. అతని మెదడులో నిధికి దారి స్పష్టంగా కన్పిస్తోంది.

# 10

గాలిలో ఉరకలు వేస్తూ ముందుకు సాగుతోంది. అశ్వం. తలపై ఉన్న కౌబాయ్‌హాట్ వెనక్కి నెట్టి క్యూలర్స్‌తో చుట్టూ చూసాడు ప్రవీణకుమార్.

దూరంగా ఆరవెల్లి కొండలు కన్పిస్తోన్నాయ్. నడుము బెల్ట్‌కు అమర్చిన రివాల్వర్‌ను వకసారి తడుముకొని అశ్వాన్ని మరింత వేగంగా ఉరికించాడు.

అతని మనస్సులో చిన్న అనుమానం కదులాడుతోంది

'ఈ ఇరవై సంవత్సరాలలో పర్వతపీఠంలోంచి నిధికి వెళ్ళే చీలిక ప్రకృతి సిద్ధంగా మూసుకుపోలేదు కదా?' అనుకొన్నాడు. అదేకాని జరిగితే లోనికి చేరుకోడం చాలా ప్రయాసతో కూడిన పని. కాలినడకతో కొండ ఎక్కి దిగాలి.'

అతనిలా ఆలోచనలలో తేలియాడుతున్న సమయంలో అశ్వం ఆరవెల్లి కొండలు దరిదాపులకు చేరుకొంది.

జాగ్రత్తగా పరిశీలిస్తూ మలుపువైపు సాగాడు. త్వరలోనే అతని ప్రయత్నం ఫలించింది. ఆ సన్నటి చీలికను చూడగానే అతని హృదయం ఆనందంతో

ఉప్పొంగింది. క్రిందికి దిగి అశ్వాన్ని నడిపించుకొంటూ లోనికి జొరబడ్డాడు.

అవతలికి చేరుకోగానే తిరిగి గుర్రాన్ని అధిరోహించి మధ్యలో కన్పిస్తోన్న నిధి గుట్టవైపు సాగాడు.

సరిగా ఇరవైఏళ్ళ క్రితంలాగేఉందా గుట్ట. వ్రేలాడుతోన్న త్రాడుని చూడగానే మళ్ళీ గుర్తొచ్చింది గతం. చీకిపోయి దారాలుగా ఊడిపోయిఉన్న ఆ త్రాడు ఏ కొంచెం బలంగాలాగినా తెగిపోయేలా ఉంది.

'ఈ త్రాడు వెంబడే పైకివెళ్ళిన తాము తిరిగి బైటకు రాలేదు.' అనుకొంటున్న ప్రవీణ్‌కుమార్‌కు ఆ నాడు తమతోకల్సి లోనికి వచ్చిన అశ్వాలు గుర్తుకొచ్చాయి. "ఏమయ్యాయో అవి ?"

గట్టిగా తల విదిలిస్తూ తనతో తెచ్చుకొన్న త్రాడు పైకి విసిరాడు. పట్టు చిక్కిందన్న నమ్మకం ఏర్పడ్డాక చర చరా ప్రాకుతూ పైకి చేరుకొన్నాడు.

చక చకా సొరంగం లోనికి నడిచి మెట్లుదిగి క్రిందకు చేరుకొన్నాడు. అంతా చీకటిగా ఉండటంవలన ముందేమీ కన్పించటం లేదు తన చేతిలో టార్చ్ వెలిగించాడు. ఎదురుగా సొరంగం నిధి ద్వారానికి అడ్డుగా గోడలా కూలిపోయింది.

రెండు నిమిషాలు ఆలోచించి తనతో తెచ్చిన గన్ పౌడర్ పాకెట్ విప్పి గోడమొదట్లోఉన్న చిన్నకంతలో కూరాడు వత్తి పర్చుకొచ్చి అంటించి మెట్లవెనక నక్కాడు

'ధన్'మంటూ పెద్ద విస్ఫోటంతో ప్రేలి గోడలాఉన్న రాళ్ళగుట్ట కూలిపోయింది. ఒక్కసారిగా గదంతా నిధి

వెలుగుతో నిండిపోయింది. మెరుపులా లేచి కాళ్ళకు రాళ్ళు తగులు న్నా లెక్కచేయక నిధివైపు పరుగు తీసాడు.

మూలగా రెండు అస్తిపంజరాలు శిధిలావస్థలోపడి ఉన్నాయ్. తుప్పుపట్టిన తుపాకులు, చిరిగి పేలికలైన తోలు ముక్కలు కన్పించాయ్ ప్రవీణ్ కుమార్ కు. అప్రయత్నంగా అతని కళ్ళలో నీళ్ళు తిరిగాయి. పిచ్చి ఆనందంతో నిధిపై పొర్లాడు. దోసెళ్ళతో వజ్రాలను ఎత్తి తలపై పోసుకొన్నాడు.

అరగంట గడచింది.

ఆనందం నుంచి తేరుకొన్న ప్రవీణ్‌కుమార్ తనతో తెచ్చిన బాగ్ విప్పి నింపసాగాడు.

'ఈ బాగ్‌లో బంగారం చాలు తన జీవితం హాయిగా గడిచిపోవటానికి.' అనుకొంటూ వెనక్కి తిరిగాడు.

రెండడుగులు ముందుకు వేశిన ప్రవీణ్‌కుమార్ ఎదురుగా మెట్లపైనుంచి నవ్వుతూ క్రిందకి దిగుతున్న జైరాజ్‌ను అతని చేతిలోని రివాల్వర్‌ను చూసి ఆగిపోయాడు. మరుక్షణం అతని చేతిలోని బాగ్ విసురుగా వెళ్ళి జైరాజ్ చేతిని తాకి, రివాల్వర్‌ను ఎగురగొట్టింది.

అనుకోని ఈ పరిణామానికి ఒక్కక్షణం అప్రతిభుడయ్యాడు జైరాజ్.

వేగంగా వంగి రివాల్వర్ అందుకోబోయాడు. కాని ప్రవీణ్‌కుమార్ కాల్చిన బుల్లెట్ రివాల్వల్‌ను మరింత ముందుకు నెట్టింది.

"పిచ్చి పిచ్చి వేషాలెయ్యకు," కఠినంగా అంటూ ముందుకొచ్చి బాగ్ అందుకొన్నాడు ప్రవీణ్‌కుమార్.

జైరాజ్ రివాల్వర్ కూడా తీసుకొని జేబులో వేసుకొని అతన్ని నెట్టుకొంటూ పైకొచ్చాడు.

అవకాశం కోసం చూస్తున్న జైరాజ్ ప్రక్కకు దూక బోయాడు. కాని ముందుగానే గమనించిన ప్రవీణ్‌కుమార్ కాలు అడ్డు పెట్టడంతో ముందుకు పడ్డాడు. అతనిమెడ పట్టుకొని బయటకు ఈడ్చుకొచ్చాడు ప్రవీణ్‌కుమార్.

జాగ్రత్తగా కవర్ చేస్తూ గుట్ట క్రిందకు చేరుకొన్నా రిద్దరూ. నిధిఉన్న బాగ్‌ను గుర్రానికి తగిలించాడు ప్రవీణ్‌కుమార్.

అతని కంఠం గంభీరంగా పలికింది:

"జైరాజ్. ఓ ఐయామ్ సారీ, అజిత్, అనవసరంగా అత్యాశకుపోయి క్రిందటి జన్మలో మనిద్దరి జీవితాలు పాడుచేశావు. ఇప్పుడన్నా వివేకంగా మెలగు. మనం కనుగొన్న నిధి తక్కువేమీ కాదు. వందమంది మరో వంద తరాలపాటు కూర్చొని తిన్నా తరగనంత ఉంది. మూర్ఖతకు పోయి అనవసరంగా జీవితం పాడుచేసు కోకు."

మాట్లాడలేదు జైరాజ్. మౌనంగా తన అశ్వంవైపు కదిలాడు.

నెమ్మదిగా కదులుతున్న జైరాజ్ అశ్వం దగ్గరకు చేరుకోగానే మెరుపులా వెనక్కి తిరిగాడు. అతని చేతి లోని పదునైన బాకు తళుక్కుమంది. రెప్పపాటు కాలంలో అది ప్రవీణ్‌కుమార్ వైపు దూసుకొచ్చింది.

కాని అప్పటికే ఆలశ్యమైంది. జైరాజ్ ప్రవర్తనకును గమనించిన ప్రవీణ్‌కుమార్ కాల్చిన బుల్లెట్ జైరాజ్ గుండెలను ఛేదించింది. కాని జైరాజ్ విసిరిన బాకు

దెబ్బనుండి ప్రవీణ్ తప్పుకోలేకపోయాడు. అది సూటిగా వచ్చి గుండెలో దిగబడింది. బాధతో మెలికలు తిరిగి పోయాడు.

కొద్ది నిముషాలలో ఇరువురి ప్రాణాలు అనంతవాయువులో కల్సిపోయాయి.

ఒంటరిగా మిగిలిన అశ్వాలు రెండూ ఒకసారి బిగ్గరగా సకిలించి బయటికి దౌడుతీశాయి.

బిపోయింది.

# దెయ్యం పట్టిన మనిషి!

—కంచర్ల రమణ

నేను బజార్నుంచి వచ్చేసరికి, అమ్మా, నాన్న, చెల్లి ముందరగదిలో కూచుని ఏదో తీవ్రంగా చర్చించుకుంటున్నారు. వాళ్ళ మొహాలమీది భావముద్ర ప్రకారం వాళ్ళు మాట్లాడుకుంటున్నది సాధారణ విషయం కాదని నాకు బోధపడింది. ఏమిటావిషయం?

"యేమిటి నాన్నా? యేమిటంత గట్టిగా వాదించుకుంటున్నారు!" అన్నాను నాన్నను చూసి.

"యేమిటా?" అని ఆగి ఒక్కక్షణం నా మొహంలోకి తీక్షణంగా చూసి "మీ ముదుల మామయ్య నిన్ను అర్జంటుగా పంపమని ఉత్తరంరాసాడు" అన్నాడు నాన్న.

"ఎందుకట ?" అడిగాను మామ్మూలుగా.

"ఎందుకా ?" అని నాన్న సమాధానం చెప్పబోతుంటే, మధ్యలో కల్పించుకుని "ఇప్పుడు తనకు అవసరం వచ్చింది కాబట్టి" అంది చెల్లి రోషంగా.

"ఏమిటో ఆ అవుసరం ?" అంటూ నా చేతిలోని కూరలసంచి అమ్మకు అందించాను.

సంచి అందుకుని, వంట చెయ్యటానికి ఇంట్లోకి వెళ్ళుతూ" యేముందిరా నాయనా ! ఎలాకావలిస్తే అలా మాట్లాడుకోవడానికి దేవుడు మనకో దుమ్ములేని నాలి కిచ్చాడు గదా ! యేమైనా అనుకోవచ్చు" అంది అమ్మ.

"ఇంతకూ యేమయిందమ్మా ?" అన్నాడు అమ్మను అనుసరిస్తూ.

"మనతో అవసరం పడి పిలిస్తే, అవసరం కలిగింది కాబట్టి పిలిచారంటాం. పిలవకపోతే, మమ్మల్ని దూరపు బంధువుల్లా చూస్తున్నారు చూసారా, అవసరం కలిగినా పిలవలేదంటాం," అంది అమ్మ ముక్కు ఎగపీలుస్తూ.

"అబ్బబ్బ! అసలు విషయం చెప్పకుండా ఎందుకమ్మా యీ రాద్ధాంతమంతా !" అన్నాను చిరాగ్గా.

"నన్నడక్కు. పోయి మీ నాన్నగారినే అడుగు. ఈ యింట్లో నామాటకో విలువ ఉందిగనుకనా యేనా డయినా !" అని అమ్మ మూతి బిగించేసింది.

ఆమె తీరుచూసి యిహ ఆమెనుంచి యే భోగట్టా రాబట్ట లేననుకుని, మళ్ళా ముందరగదిలోకి వచ్చాను.

"నాన్నా ! మామయ్య ఉత్తరంలో యేమిటిరాశాడు?" అన్నాను నాన్నను చూసి.

"నేను వేరేచెప్పడమందేనికి ? నువ్వే చదువుకో" అంటూ

ఓ ఇన్‌లాండు కవరు నావైపు గిరవాటేశాడు నాన్న.

ఉత్తరం గాలిలో గింగిరాలు కొట్టి, నాకు నాలుగడుగుల దూరంలో పడింది.

వంగి ఉత్తరాన్ని అందుకుని, విప్పాను చదవడానికి.

అక్షరాల్ని చూడగానే అది మామయ్యరాసిన ఉత్తరం కాదనిపించింది. నా చూపులు అప్రయత్నంగా సంతకం వద్దకు పరుగెత్తాయి.

కాని గజపతిమామయ్య సంతకానికి అక్కడున్న సంతకానికి దగ్గరపోలిక ఉన్నాయి. కాస్త గజిబిజిగా, ఎగుడుదిగుళ్ళుక్కవగా ఉన్నా, అది గజపతిమామయ్య సంతకమే: సందేహం లేదు.

దస్తూరీ బట్టి దాని వెనుకనున్న వ్యక్తియొక్క స్వభావాన్ని నిర్ణయించవచ్చునన్న విషయం నిజమో కాదో నాకు తెలీదుగాని, ఎప్పుడూ గుండ్రని ముత్యాల్లాంటి అక్షరాల్లో ఉత్తరం రాసే మామయ్య వంకరటింకరగా, వరుసావాడీ లేకుండా రాసేడంటే, మామయ్యనేదో భయాందోళనలు బాధిస్తున్నాయని అర్థంచేసుకోవడానికి నేను పెద్ద కష్టపడలేదు.

మామయ్య కొచ్చిన కష్టమేమిటి?

ఉత్తరం చదవనారంభించాను.

అనవాయితీగా జరిగే పలకరింపుల తర్వాత గజపతి మామయ్య రాసినదిది:

"మిమ్మల్ని నాకు చాలాదూరంగా ఉంచానన్నవిషయం నాకు తెలుసు. నేను ఆర్థికంగా ఎంతో ఉన్నతస్థితిలో ఉన్నా, మీకు సాయం చెయ్యలేదన్న సంగతి కూడా నాకు తెలుసు. అదంతా గతం. మర్చిపోండి. నాకిప్పుడు

మీ సాయంకావాలి. చెయ్యండి అందుకుతగిన ప్రతిఫలం తప్పక చూపిస్తాను.

సాయం అంటే యేమిటో అనుకునేరు. మీ సీతాపతిని కొన్నాళ్ళపాటు నాతో వుంచడమే;

మా చెల్లెలుకు నేనంటే జాలి, అభిమానం ఉన్నాయి. అయితే అమెమాటకు మీరు విలువయివ్వరు. అంచేత యీ ఉత్తరం సీతాపతికి చూపండి. వాడికికూడా నాకు సాయం చెయ్యడం యిష్టంలేదనిపిస్తే, ఆ సంగతి నాకు తెలియ జేయండి. నాకు అదృష్టం లేదనుకుంటాను

సీతాపతి రాకకోసం యెంతో ఆశగా యెదురుచూస్తు న్నాను. వాడ్ని తప్పక పంపుతారు కదూ!"

ఉత్తరాన్ని మడిచేసి తిరిగి నాన్నకు అందించాను

ఉత్తరం అందుకుంటూ అడిగాడు నాన్న "యేం? వెళ్తావా?" అని.

"వెళ్తాను. యేం!" అన్నాను.

మొహంమీద ఆశ్చర్యముద్రతో అలాగ ఉండిపో యాడు నాన్న కాసేపు.

"మరీ అంత ఆశ్చర్యపోవాల్సిందేమీలేదు. నాకిప్పుడు ఉద్యోగం సద్యోగం లేదు. తీరిగ్గా యిక్కడ కూచుని నేను చేసేదేముంది? ఆ కూచునేదేదో వెళ్ళి మామయ్యా యింట్లోనే కూచుంటాను." అన్నాను క్షణంపోయాక మళ్ళీ నేనే.

నాన్న యేదో అనాలని ప్రయత్నించాడు. కాని, నేనో సారి ఏదైనా నిర్ణయం తీసుకుంటే మార్చుకోనన్న విషయం గుర్తొచ్చినట్టుంది.

"నీ యిష్టమొచ్చినట్టు తగలడు" నాన్న చీదరించు

కున్నాడు.

ఇంచుమించు అలాంటిమాటలే చెప్పి, చెల్లికూడా నన్ను మామయ్య వద్దకు వెళ్ళడానికి తీసుకున్న నిర్ణయాన్ని గట్టిపరిచింది.

గజపతిమామయ్యకు ఖరీదైన సరదాలుండేవి. అయితే ఆ సరదాలు తీర్చుకోవడానికి అవసరమయ్యే డబ్బు ఉండేదికాదు. తను సుఖపడాలంటే, తన సరదాలు తీరాలంటే, ముందుగా డబ్బు సంపాదించాలనుకున్నాడు.

డబ్బు సంపాదించడం కోసం మామయ్య చెయ్యని వ్యాపారమంటూలేదు. అవలంబించని వృత్తంటూలేదు. అయితే, యేవృత్తిలో నయినా, ఋజుమార్గాన పోయిన వాడికి నష్టం ఖాయం యీరోజుల్లో అన్నవిషయం తెలీదు మామయ్యకు.

ఫలితంగా, మామయ్య యే వ్యాపారంలోనూ రాణించ లేదు. అతడనుకొన్న డబ్బు సంపాయించలేదు. అతడి సరదాలు అలాగే ఉండిపోయాయి తీరకుండా.

అలాంటి సమయంలోనే మామయ్య రాజ్యలక్ష్మి అత్తయ్యను కలుసుకొన్నాడు. అప్పటికి రాజ్యలక్ష్మి అత్తయ్య భర్త చచ్చిపోయి, కొన్ని లక్షల ఆస్తి, ఒక అందాల బొమ్మలాంటి కూతుర్ని వెనక్కి వదిలిపోయాడు.

గజపతిమామయ్య పొడుగ్గా, యెర్రగా కండలుదిరిగి సినిమాయాక్టర్‌లా ఉంటాడు. అతడి అందం చూసి రాజ్యలక్ష్మి అత్తయ్యే మురిసిపోయి, గజపతిమామయ్యను తనను పెళ్ళిచేసుకోమని కోరిందో, లేక అతడే ఆమెవద్ద చేరి, ఆస్తికోసం ఆమెను లొంగదీసుకొన్నాడో తెలియదు గాని, నలభై అయిదేళ్ళవరకు పెళ్ళి పెటాకులు తలవని

గజపతిమామయ్య పెళ్ళి చేసుకొన్నాడు రాజ్యలక్ష్మి అత్తయ్యను.

గజపతిమామయ్య రాజ్యలక్ష్మి అత్తయ్యను చేసుకోవడంతో అతని సమస్యలన్నీ తీరిపోయి ఉండాలి.

లక్షలకు అధికారి అయ్యాక తన సరదాలన్నీ తీర్చుకుంటూ వుండాలి.

మామయ్య, అత్తయ్య ఎంతో అన్యోన్యంగా ఉండేవారంటారు చూసినవారంతా. యేమయ్యిందో యేమోగాని గతించిన నెలలో రాజ్యలక్ష్మి అత్తయ్యకు జబ్బుచేసింది. మంచంమీద వారం రోజులుండి చనిపోయింది.

డబ్బొచ్చాక మామయ్య మమ్మల్ని దూరంగా వుంచాడేమో, అత్తయ్య చనిపోయిందని తెలిసినా మేమెవ్వరం మామయ్య యింటికి వెళ్ళలేదు. మామయ్యకూడా మమల్ని రాలేదేం అనిగాని, రమ్మనిగాని అనలేదు.

అదే యీనాటికీ, మానాన్న మనసులో నాటుకుని ఉండిపోయి యిప్పుడు నన్ను రమ్మని మామయ్య ఉత్తరం రాస్తే, అంత మండిపోయాడు నాన్న.

పెంకులు రాలిపోతున్న పాత పెంకుటింట్లో నివాసం, పచ్చడిమెతుకుల తిండితో విసిగెత్తి పోయున్నానేమో, మామయ్యలాంటి ధనవంతులు గడిపే జీవితం యెలాగుంటుందో చవిచూడాలని ఎంతో కుతూహలంగా వుంది లోలోన నాకు.

మామయ్య మా కుటుంబంపైన యింతకు ముందు చూపిన నిర్లక్ష్య భావాన్ని అందుకే ప్రక్కకు నెట్టి, విశాఖపట్నం బయలుదేరాను మామయ్య దగ్గరకు.

# 2

నేను యెక్కిన టాక్సీ సముద్రతీరాన్నానుకుని పరుగులు తీసే తారు రోడుమీద చాలా సేపు ప్రయాణించేసి ఆగింది ఓచోట.

"దీన్నే సిల్వర్ బీచ్ అంటారు. దిగండిసార్!" అన్నాడు టాక్సీవాడు. టాక్సీదిగి ఫేరిచ్చి పంపేశాను.

సిల్వర్‌బీచ్‌కి యెదురుగా దిబ్బలమీదున్న బంగ్లాల్లో కల్లా అందమైనది, పెద్దదీ, మామయ్యఉంటున్న బంగ్లా. దానిపేరు "ప్రేమనికుంజ్"

ముందరున్న గేటుతీసి లోనికెళ్ళగానే, అందమైన పూలతోట, మధ్యలో రెండంస్తుల యెర్రమేడఉంది. ఆకాశంలోకి నిటారుగా, హుందాగాలేచి.

లోనికడుగెట్టగానే తోటమాలి యెదురొచ్చి "ఎవరు కావాలిబాబూ?" అన్నాడు వినయంగా.

మామయ్యపేరు, నాకు అతనితోటి ఉన్న బంధుత్వం చెప్పగానే, తోటమాలి మొహం ఆనందంతో విప్పారింది.

"రండిబాబూ! రండి. మీ కోసమే చూస్తున్నారు ఎప్పుడొస్తారా అని" అని నన్ను లోనికి తీసుకెళ్ళాడు తోటమాలి.

మామయ్య వరండాలో వాలుకుర్చీలో పడుకుని ఉన్నాడు. అతన్ని చూస్తూనే నివ్వెరపోయాను.

అతడు నేనెరిగిన మామయ్యకాదు. పొడుగ్గా,యెర్రగా వస్తాదులా, తనునడచే భూమికి రాజునన్నట్లుగా ఉండే మామయ్యకూ, నిస్తేజంగా, నల్లబడిపోయి దేనికో జడిసి కుర్చీలో నిస్సహాయుడిలా పడిఉన్న మామయ్యకూ యెక్కడా పోలికేలేదు.

మామయ్య రాతనుబట్టి, మామయ్య మానసిక స్థితిని నేను సరిగ్గానే అంచనా వేసానన్నమాట! అనుకున్నాను మనసులో.

"బాబూ! మీ మేనల్లుడుగారు వచ్చారు బాబూ!" తోటమాలి మృదువుగా, మెల్లగా అన్నాడు.

మామయ్య కళ్ళుతెరచాడు తక్షణం.

ఎదురుగా నిలుచున్ననన్ను చూసి "వచ్చావుట్రా సీతాపతీ! ఇంకనాకు ఫరవాలేదు" అంటూ బరువుగా నిట్టూర్చాడు.

అతడి గుండెలమీద అంతవరకూ ఉన్న భారమేదో దిగిపోయినట్టుగా అతని మొహంలో రిలీఫ్ కనిపించింది.

నా రాకవల్ల మామయ్యకంత ఆనందం కలిగినందుకు నాకెంతో సతోషమైంది

మామయ్యకు దగ్గరగా ఓ స్టూలు లాక్కొని కూచుని "యేం మామయ్యా! అలాగయిపోయావేం?" అన్నాను.

"ఎలాగయిపోయాను?......యేం నాలో మార్పు అంత కొట్టొచ్చినటు అవుపిస్తోందా?" అడిగాడు మామయ్య మందంగానవ్వి.

"అని అడుగుతున్నావా? సింహం అమాంతంగా లేడి పిల్లగా అయిపోయినట్టు అనిపిస్తున్నావు ఇంతకూ స:గ తేమిటి?"

మామయ్య నా ప్రశ్నకు వెంటనే జవాబివ్వలేదు. కాసేపు నా మొహంలోకి, కాసేపు వేరే దిక్కుకిచూసి రెండుమూడు నిముషాలతర్వాత "మీ అత్తయ్యపోయాక, ఏమిటో ఒంటరితనం భరించరానంత ఎక్కువై పోయి నట్లు అన్పిస్తోంది. అందుకే నిన్ను రమ్మన్నాను."

అన్నాడు మెల్లిగా.

అతని జవాబు నాకు చాలా అసంతృప్తిగా ఉంది.

"అదేమిటి మామయ్యా. నీకు తోడుకావాలంటే తోట మాలీ లేడూ?......అయినా మాయ ఉంటోందిగా నీతో.. అంతగా కావలిస్తే, నాలుగు రోజులు వంటావిడ్ని రాత్రుళ్ళు ఉండమంటే ఉండిపోదా?......మరీ అంత బోరనిపిస్తే, ఊళ్ళో హోటళ్లో ఉండొచ్చుగదా?" అన్నాను.

మామయ్య నాకు జవాబివ్వకుండా రెండునిముషాలు నా కళ్ళల్లోకి నిరాశగా, దీనంగా చూసి "ఇక్కడనాతో ఉండడానికి నీకేమన్నా అభ్యంతర ముందా?" అన్నాడు.

"అబ్బె లేదుమామయ్యా! అందుకేగా వచ్చింది" అన్నాను.

"చూడు అప్పన్నా! సీతాపతికి మేడమీద గదిలో మకాం యేర్పాటుచెయ్యి!" అన్నాడు మామయ్య తోట మాలిని చూసి.

"అలాగేనండి" అనిచెప్పి తోటమాలి అప్పన్న నన్ను మేడ మీదకు తీసుకెళ్ళాడు.

నాకివ్వబడిన గది విశాలంగా సదుపాయంగా ఉంది. గదికి మధ్యగా ఫోం బెడ్‌తోఉన్న మంచం ఉంది. ఓ మూలగా ఒక టేబిలు, కుర్చీ, మూడు స్టూల్స్, ఒక టీపాయ్ ఉన్నాయి.

చాలా రోజుల తర్వాత ఆ గది నా కోసం తెరచి, శుభ్రం చేసి యిచ్చినట్టున్నారు. చిన్నగా ముక్కు వాసన వేస్తోంది. గదికి ఉన్న ఒకేఒక్క పెద్దకిటికీ తెరచాను. దుర్వాసన తరిమేయడానికి.

కిటికీ, యింటి వెనుక తోటవైపుకుంది. దాన్ని తెరి

దాక, తోటలోకి ఓసారి చూసాను. తోటలో ఓ అమ్మాయి పద్దెనిమిదేళ్ళ ప్రాయమున్నది, కుక్కతో ఆడుకుంటోంది.

ఆమే మాయ! మామయ్య గురించిన ఆలోచనల్లో మాయగురించి మర్చిపోయాను. మాయ, రాజ్యలక్ష్మి అత్తయ్యకు మొదటి భర్తవల్ల కలిగిన అమ్మాయి.

మామయ్య యింటికి ఇంతకుముందెన్నడూ రాక పోయినా, ఓ పిక్నిక్‌లో కలుసుకున్నాం మాయ, నేనూ కాకతాళీయంగా.

మాయ, నేనూ బాగా స్నేహితులమయ్యాం అప్పుడే.

"మాయా!" కేకేస్తూ చెయ్యి ఊపాను, మాయను రమ్మన్నట్టుగా.

"ఎవరూ?" అంటూ తలెత్తి చూసి, నన్ను గుర్తించి "నువ్వా! ఎంతసేపయింది వచ్చి?"

"వచ్చి పది నిముషాలయింది. వచ్చిన పెద్దమనుషుల్ని పలకరించడమంటూ ఉందా లేదా?" అన్నాడు నవ్వి.

మాయ కుక్కను పంపేసి, రెండునిముషాల్లో పరుగు పరుగున నా గదికి వచ్చింది.

పిక్నిక్‌లో చూసినప్పటికీ, యిప్పటికీ ఆమెలో మార్పు యేం వచ్చిందో అని నిశితంగా చూసాను మాయను.

మాయ అందగత్తెలకే అందగత్తె. గులాబీరంగు శరీర ఛ్ఛాయ, చక్రాల్లాంటి కళ్ళు, షుమారైన ఎత్తు, మగాడిలోని పురుషత్వాన్ని సవాలుచేసే బలిష్ఠమైన రొమ్ములు, అందాన్ని దేవుడ్నించి వరంగా పొందినట్టుగా అనిపిస్తుంది.

"యేంటలా చూస్తున్నావు నన్ను? వింతజంతువును

చూస్తున్నట్టుగా" అంది మాయ ఫక్కున నవ్వి.

"నువ్వుకూడా నన్ను అలాగే చూస్తున్నావుగాబట్టి" జవాబిచ్చాను తమాషాగా.

"నీలా నేను కొరికేస్తున్నట్టు చూడ్డంలేదులే. క్రితం సారికీ యిప్పటికీ యేం మారానో అని చూస్తున్నానంతే!" అంది మూతి వంకరలు త్రిప్పి.

"మారానా?... చూసి చెప్పు" అంటూ చుబుకం బాగా పైకెత్తి నిటారుగా నిలుచున్నాను.

నా చుట్టూ రెండుసార్లు తిరిగి "కసరత్తుచేస్తున్నట్టు న్నావు కండలు తిరిగివుంది శరీరం. బీరుతాగడం బాగా యెక్కువైనట్టుంది, బుగ్గలు బాగా నునుపెక్కాయి" అంది, పెదవుల మధ్య నవ్వును నొక్కిపడ్తూ.

"తగ్గు! తగ్గు! బీరు కాదుగదా యింటిదగ్గర నీరు తాగడమే కష్టంగా వుంది... ఇంతకూ మామయ్య నన్నెం దుకు పిలిపించినట్టు? నీకేమైనా తెలుసునా?" అడిగాను మాయను. అమైనా నా అనుమానం నివృత్తిచేస్తుందని.

"నీకు నన్ను కట్టిపెట్టడానికిమాత్రం కాదులే. కంగారు పడకు".

"ఛ! ఛ! అంత దురాశలేదు నాకు" అన్నాను నవ్వి.

"అయితే బాగుపడతావ్! ఫో!... మీ మామయ్యకు ఏదో కాంప్లెక్సు పట్టుకుంది యీ మధ్యనే. తన నీడను చూసి తనే జడుసుకుంటాడు. కిటికీలు చప్పుడయినా, గాలి గట్టిగా వీచినా, ఆఖరుకు పిల్లి మైలుదూరంలో ఉండి మ్యావ్‌మన్నా, యిక్కడ ఉలిక్కిపడతాడు."

"ఇదంతా యెప్పటినుంచి?"

"ఇంచుమించు మా అమ్మ చచ్చిపోయిననాటినుంచి

అనుకో."

"కారణమేమిటో నీకు చెప్పలేదా?"

"ఆయనకు తెలిస్తేగదా చెప్పడానికి!"

"అతనికి కూడా తెలియకుండా యెలావుంటుంది?"

"లేకపోతే మనకు చెప్పివుండేవాడుగా. మనం యేదో చేసి అతని భయం పోగొట్టేవాళ్ళంగదా!"

"ఆల్ రైట్! నేను యిక్కడకు రావడం నీకు యిష్ట మేనా?" ఊరికినే అలా అన్నాను, యేమంటుందో చూద్దా మని.

"ఇష్టమని అడుగుతున్నావా?... నువ్వు రావాలని దేవుణ్ని ప్రార్థిస్తున్నాననుకో... మీ మామయ్య అలా ఆయిపోయారు. ఇంక యీ దిక్కుమాలిన యింట్లో ఒక్కర్తినే బిక్కుబిక్కుమంటూ కాలం గడుపుతున్నాను."

"ఇంక నీకు కాలక్షేపానికి కరువుండదులే. అభ యం యిస్తున్నాను. నిశ్చింతగా ఉండు" అన్నాను నాటకం ఫక్కీలో అభయముద్ర పట్టి.

మాయ ఉప్పెనగా నవ్వి "సామాన్లు అన్నీ సర్దుకుని విశ్రాంతితీసుకో. నీకు కాఫీ టిఫిను పంపిస్తాను," అంటూ అక్కడనుంచి దిగువకు తుర్రుమంది.

ఆ తరువాత నా సామానులు సంచుల్లోంచి బైటికితీసి గదిలో సర్దడంలో మునిగిపోయాను.

# 3

రాత్రి పదిన్నర కావస్తోంది. అంతవరకూ బెడ్‌లైటు వెలుగులో ఓ క్రైం నవల సగం చదివి, యిహ ఆట్టే చదివే ఓపికలేక లైటు ఆర్పేసాను.

మెత్తని సిల్కులాంటి చీకటి గదంతా పరచుకుంది.

తెరచి ఉన్న కిటికీల్లోంచి తెరలుతెరలుగా లోనికి వస్తున్న గాలి ఒంటికి చల్లగా తగిలి హాయి కలిగిస్తోంది.

నా చూపులు యధాలాపంగా కిటికీ దాటి వెలుపలికి పరుగెత్తాయి. బయట తోటలో వెన్నెల మందంగా కురుస్తోంది.

అప్రయత్నంగా నా మనస్సు నిన్నటికీ, యివాల్టికీ నా జీవితంలో వచ్చిన మార్పును బేరీజు వేసింది.

నిన్న మా వూర్లో, పీధరుగుమీద, ఓ తుంగచాపమీద పల్చని దుప్పటి పరుచుకొని, రద్దుగద్దల తలగడ తల క్రింద పెట్టుకుని భవిష్యత్తునుగురించి యేవో కలలు గంటూ పడున్నాను. ఇవాళ యిక్కడ, మెత్తని ఫోం బెడ్‌మీద దొర్లుతూ సుఖం అంటే యేమిటో రుచిచూస్తున్నాను మొదటిసారిగా.

హుఁ... యెన్నాళ్ళనే యీ సుఖం? మహాఅయితే నెల లేదా రెండు నెలలు.

ఆ తరువాత మళ్ళా, నా తుంగచాప, రద్దుగుద్దల తలగడమీద పడక ఉండనే వుంది.

గదిలోని నిశ్శబ్దాన్ని చీలుస్తూ వినవస్తోంది సముద్రపు హోరు.

ఎవరో జోలపాడుతూ, ఉయ్యాలూపుతున్నట్టుగాఉంది, లయాన్వితంగా వినబడుతున్న హోరు వింటుంటే.

నిద్ర మెలమెల్లగా మృదువుగా నా కనురెప్పలమీద పువ్వులు అద్దినట్టుగా నన్ను ఆక్రమించుకోవడం మొదలు పెట్టింది.

నేను చిక్కని చీకటి కెరటాలమీద తేలిపోతున్నట్టు, మెత్తని దూదిపింజలు లోయలోకి జారిపోతున్నట్టు అని

పించసాగింది.

ఎంతో...ఎంతో...హాయిగా ఉంది! చాలా సుఖంగా వుంది!

ఎప్పుడూ యింత మత్తుగా నిద్ర రాలేదు.

అవును! యెప్పుడూ రాలేదు! యెప్పుడూ రాలేదు!

"అమ్మో!... చచ్చిపోయాను! బాబోయ్ చచ్చిపోయాను!"

ప్రశాంత వాతావరణాన్ని ఛిన్నాభిన్నం చేస్తూ మామయ్య వెర్రికేక.

క్షణంలో నా నిద్ర తుళ్ళిపోవడం; టేబిలులైటు వేస్తూనే మామయ్యవద్దకు పరుగెత్తడం జరిగింది.

"యేమైంది మామయ్యా? యేమైంది మామయ్యా?"

ఒళ్ళంతా చెమట్లుపోసి, యెండుకొమ్మను వేల్లాడుతున్న యెండుటాకులా వణికిపోతున్న మామయ్యను గట్టిగా పట్టుకుని కుదుపుతూ అడిగాను.

మామయ్యకు నా మాటలు విన్పడ్డాయో, లేదో తెలీదు గాని, అతని దృష్టి నావైపుకు మళ్ళలేదు. ఇంకా ఆ భ్రాంతి లోకంలోనే ఉన్నాడు.

"అమ్మో! చచ్చిపోయాను......బాబోయ్ చచ్చిపోయాను..." సీలింగు వైపు చూస్తూ అరుస్తున్నాడు మామయ్య.

మామయ్యకు భయంకరమైన పీడకలేదో వచ్చింది. కల ప్రభావం నుంచి యింకా ఆయన విడివడలేదు.

మామయ్యను మళ్ళా గట్టిగా కుదిపి వూపుతూ 'యేం జరిగింది మామయ్యా" యేం చూసావు కలలో? యెవరు నిన్ను చంపాలని చూస్తున్నారు? అన్నాను

బిగ్గరగా.

నా మాటలు అతని మనస్సును చొచ్చుకున్నట్టున్నాయి నా కళ్ళల్లోకి చూసాడు. నన్ను గుర్తించిన చూపు వచ్చింది అతని కళ్ళలోకి.

"కలగాదురా ఇది నిజంగానే చూసాను. ఒక తెల్లని ఆకారం, చేతిలో బారుకత్తి పుచ్చుకుని నా కంఠంలో దిగవెయ్యడానికి మీదకు ఊరకబోయింది. నేను భయంతో కేకపెట్టగానే ఆగిపోయింది....ఇప్పుడా రూపం అదృశ్యమైంది" చెప్పాడు మామయ్య, భయం తో దుఃఖంతో వణుకుతున్న కంఠంతో.

'ఇదేనా మొదటి సారి యిలా అవడం? ఇంతకు ముందెప్పుడయినా యిలా జరిగిందా?' అడిగాను కుతూహలంగా.

"చాలా రోజుల బట్టి ఏదో అదృశ్య రూపం నన్ను వెన్నాడుతున్నట్టు నిపిస్తోంది. నేను గదిలో ఒంటరిగా వుంటే, నా వెనుగ్గా ఎవరివో అడుగుల చప్పుళ్ళు విన్పడతాయి. కిటికీకి దగ్గరగా గాలి కోసం కూచుంటానా, ఎవరో కిటికీలోంచి గదిలోకి దూకి వచ్చినట్లు గాలి రివ్వుమంటుంది. అర్ధరాత్రప్పుడు గదిలో పడుకున్న నాకు, నా చెవికి దగ్గర్లో ఎవరో రహస్యమంతనాలు సాగిస్తున్నట్లు అస్పష్టంగా గుస గుసలు వినిపిస్తున్నాయి. మామయ్య ఆగాడు ఊపిరి పీల్చుకోడానికి.

'ఇవన్నీ యెందుకు జరుగుతున్నాయో నీకేమన్నా అయిడియా ఉందా?' మామయ్య కళ్ళల్లోకి లోతుగా చూస్తూ అన్నాను.

'యేమోరా నాకూ తెలీదు' అన్నాడు మామయ్య

గట్టిగా నిట్టూర్చి, కళ్ళు మూసుకుని నిద్రపోవడానికి ప్రయత్నిస్తూ.

ఇలాంటి పరిస్థితుల్లో మామయ్యకేం సాయం చెయగల్ను? నా మనస్సు ఆవేదనా భరితమైంది.

వెనక్కి పోయి పడుకోవాలనుకున్నాను. లేవబోయాను మామయ్య చటుక్కున కళ్ళుపిపి 'వెళ్ళిపోకురా సీతాపతి! సుఖంగా నిద్రపోయి ఎన్నాళ్ళయిందో నాకు. నువ్వు నాతో కూడా ఉంటే ఆ దెయ్యం కనిపించదు'అన్నాడు.

తెల్లవార్లూ మామయ్య మంచం ప్రక్కనే, అతని మొహంలోకి చూస్తూ, అతనికి కాపలా కాస్తూ కూచున్నాను.

# 4

దెయ్యాల్ని, భూతాల్ని, సిదల్ని, గాలుల్ని, చూసి జడుసుకునే రకంకాదు మామయ్య. ఆ విషయం నాకు బాగా తెలుసు.

అయితే, పులిలా తిరిగిన మామయ్య పిల్లిలా ఎలా మారిపోయాడు?

ఉదయం పదకొండు కావస్తుండగా, మామయ్య కార్లో ఊర్లోకి వెళ్ళాడు ఏదో పనిమీద. ఇహ ఆలంకంత కోపంలో ఉన్నది, తోటమాలి అప్పన్న, వంటావిడ వెంకటమ్మ, మాయ.

మామయ్య ప్రస్తుతం ఉన్న పరిస్థితికి కారణం వారికేమైనా తెలుస్తుందేమో కనుక్కోవాలనిపించింది.

ముందుగా, మాయను అడగాలనుకున్నాను మామయ్య గురించి. మాయ గదికి పోయిచూసాను ఆమె అక్కడలేదు. వంటావిడను అడిగాను, మాయా

యెక్కడుంటుందో చెప్పమని.

"ఆమెకు యెప్పుడు తోచకపోయినా బీచికి పోయి తిరుగుతుంది." చెప్పింది వంటావిడ.

బంగ్లా వెలుపలికి వచ్చి, రోడ్డుదాటి, బీచికి వచ్చాను. అలా సముద్రపు అంచున కొంత నీళ్ళల్లోనూ, కొంత యిసుక మీద నడుచుకుంటూ బయలు దేరాను.

ఆ ప్రాంతంలో బీచి ఎంతో అందంగా, శుభ్రం గానూ ఉంది సాధారణంగా ఆ ప్రక్క బీచికి వచ్చే మనుషులు బహుతక్కువ.

ఒకవేళ మాయ అగపడకపోయినా నా శ్రమ వృధా కాదనిపిస్తోంది. నీలాకాశం క్రింద. అంతకన్నా నీలంగా ఉన్న సముద్రపు అంచున నడుస్తుంటే.

సముద్ర వొడ్డున ఉన్న యే యిసుక దిబ్బల మధ్యో మాయ కూచుని ఉంటుంది. అందుకే, ఆమె నా దృష్టి లో పడలేదు. తీరం అంచుకంటా నా చూపు సారించినా.

ఇంచు మించు అరమైలు దూరం వెళ్ళాను. ఇంకా నడవాలనే ఉంది విసుగనిపించలేదు.

అలా ముందుకు సాగిపోతుంటే, "సీతాపతి! ఇలారా! అంటూ పిలిచింది మాయ ఏవోపిచ్చి మొక్కల మధ్య నుంచి. చప్పున అటు తిరిగి 'నువ్విక్కడున్నావా? నీ కోసమే వచ్చాను" అన్నాను అమె వైపు కదిలి.

'ఇలారా! ఇక్కడ నీడగా వుంది. బావుంటుంది. కూర్చోవడానికి' అంటూ పిలిచింది నన్ను.

నేను పోయి ఆమె ప్రక్కనే ఇసుకలో కూలబడ్డాను. మాయ చెప్పినట్టుగానే ఆ చోటు చల్లగా హాయిగా ఉంది.

'తరచుగా ఇక్కడికొస్తుంటావా?' అన్నాను యిసక

లో నేలితో యేవో పిచ్చి గీతలు గీస్తూ.

వస్తూనే మామయ్య గురించి అడగడం బావుండదని పించింది.

"చాలా తరుచుగా, బోరు కొట్టినపుడల్లా, అమ్మ జ్ఞాపకం వచ్చినప్పుడల్లా వస్తుంటాను." చెప్పింది మాయ.

"పెళ్ళి చేసుకో గూడదు. బోరు అంతా యెగిరి పోతుంది." అన్నాడు, అమెకళ్ళల్లోకి గాకుండా, ఉవ్వెత్తుగా లేచివచ్చి ఒడ్డున విరిగి పడ్తున్న నీలి కెర టాల వైపు చూస్తూ.

"పెళ్ళా"......యీ జన్మలో చేసుకోను' టక్కున వచ్చింది. ఆమె నుంచి సమాధానం.

ఆమె తమాషాగా అందేమోనని ఆమె మొహంలోకి చూసాను. కాని సీరియస్‌గా ఉందామె మొహం.

'ఎందుకో ఆ వైరాగ్యం" కారణం తెలుసుకోవచ్చునా నవ్వుతూ అన్నాడు.

'సంసారం సుఖంగా సాగాలంటే డబ్బు అవసరం. కాని మితిమీరిన డబ్బు సంసారానికి శాపంగాను, భార్యా భర్తల అన్యోన్యతకు విషంగాను మారుతుంది.."

'పోనీ నా లాంటివాడ్ని, డబ్బులేని వాడ్ని చేసుకో'

"కాని నాకు డబ్బుందిగా. అది నా తల తిప్పేస్తుంది. కొద్ది రోజుల్లో.'

"ఇంత వేదాంతం నీకెవరివల్ల అబ్బిందో కూడా చెబితే సంతోషిస్తాను."

"ఇంకెవరు? మా అమ్మ."

"మీ అమ్మకేం?"

"మా అమ్మ కడుపేద కుటుంబంలో పుట్టింది.

కానయితే, అందానికి, తెలివితేటలకు లోటులేదు. తనకు డబ్బులేకపోవడంవల్ల, డబ్బంటే ఒకవెర్రివాంఛ పెంచుకుంది.

డబ్బులేకపోవడంవల్ల, తనకెన్ని సుఖాలు అందకుండా పోతున్నాయో ఊహించుకుని, డబ్బుకోసం తపించిపోయింది. లక్షల డబ్బు మూల్గుతున్నవాడు, మూడో పెళ్ళికి సిద్ధంగాఉన్న వాడొకడు మా అమ్మను చూసాడు. అతడి డబ్బు చూడగానే అమ్మ మారు మాటాడకుండా పెళ్ళి చేసుకుంది.

తీరా పెళ్ళయ్యాక తెలియవచ్చిందేమంటే విపరీత స్త్రీలోలత్వంవల్ల ఆ మానవుడు తన పురుషత్వాన్ని ఏనాడో కర్చుపెట్టేసుకున్నాడు. అయితే తన వంశం నిలబెట్టుకోవడానికి ఆయనకో వంశాంకురం కావాలి. కాని ఆతనిలో వీర్యత్వం లేదు.

అమ్మ పరిస్థితి అర్థం చేసుకుంది. ఫలితంగా ఎవడో ఒక అనామకుడివల్ల నన్ను కన్నది.

అలా అలవాటుపడింది అమ్మ పురుషులకు. మా నాన్నగారు బ్రతికున్నంతకాలం ఆయన ఆమెకో రక్షక కవచం అయ్యారు. తీరా ఆయనపోయాక, ఆమె తిరుగుళ్ళకు కావలసిన రక్షణ లేకపోయింది. ఇటు తన వాంఛలు తీరడానికి, అటు రక్షణ యివ్వడానికి ఆమెకు ఒక మగవాడు అవసరమొచ్చాడు. అప్పుడే మీ మామయ్య అవుపించాడు.

అమ్మ సంగతి పూర్తిగా తెలిసాక కూడా ఆయన అమ్మను పెళ్ళిచేసుకొన్నాడు. తెలిసికూడా ఎందుకు చేసుకొన్నాడో యీ నాటికీ నాకు అర్థంగాని శేష ప్రశ్న.

అమ్మ దబ్బుచూసి ఆమెను చేసుకొన్నాడని నా అనుమానం."

మొట్టమొదటి సారిగా మామయ్య కుటుంబ జీవితం గురించి చాలా విషయాలు తెలుసుకున్నాను. కాని అతడున్న ప్రస్తుత పరిస్థితికి అవసరమయ్యే క్లూ, అతని గతజీవిత విశేషాలు యివ్వలేకపోయాయి. మనస్సులో దిగులు ఆవరించసాగింది.

"మరి మీ అమ్మా, మామయ్య చాలా అన్యోన్యంగా ఉండేవారు కాదా ?" అన్నాను రెండు నిముషాలనంతరం.

"వాళ్ళమధ్య ద్వేషాలు లేకపోయినా, వాళ్ళిద్దరి మధ్య పెద్దగా ప్రేమలు పొంగిపొర్లి పోలేదని మాత్రం చెప్ప గలను."

"దాఖలా యేమిటి ?"

"ఎన్నోసార్లు మా అమ్మ ప్రేమగా మీ మామయ్యకు దగ్గరగా రాబోతే, కంపరం యెత్తినవాడిలా మీ మామయ్య మొహం పెట్టగా ఎన్నోసార్లు చూసాను."

"గతాన్ని తవ్వి యిప్పుడు ప్రయోజనం లేదు. నీ వుద్దేశంలో మామయ్య యిలా అయిపోవడానికి కారణం యేమిటి ?"

"నాకేం తెలీదు."

"యేదైనా ఉండొచ్చునేమోనని ఊహించనైనాలేదా?"

"అనవసరంగా తలబ్రద్దలు కొట్టుకోవడం యిష్టంలేక ఊరుకొన్నాను."

"మామయ్యంటే నీ కిష్టంలేదా ?... ఆయన నీపట్ల యెలాగుండేవాడు ?"

"చెప్పడం మర్చిపోయాను... ఆయనకు నేనంటే

ఎంతో ప్రేమ... నామాట కాదనడు."

"అలాంటి వ్యక్తిని పోగొట్టుకుంటే నీకెంత నష్టమో ఆలోచించావా ?"

"ఆలోచించాను. అయితే యేం లాభం? నేను చెయ్య గలిగిందేమీ లేదుగదా !"

"ఇహ వెళ్దాం పద." అంటూలేచాను. మాయకూడా లేచింది. ఆమె ప్రక్కన నడుస్తున్న నా కుడిచెయ్యి అప్రయత్నంగా ఆమె భుజంమీద పడింది. ఒక్క క్షణం ఆశ్చర్యంగా నా కళ్ళల్లోకి చూసింది, తలత్రిప్పి. తప్పు గ్రహించి చెయ్యి తీసేసుకోబోయాను. కాని, అప్పటికే ఆమె ఎడమ చెయ్యి నా నడుంను చుట్టేసింది. ఆమె తల నా భుజంమీద వాల్చి గాఢంగా నిట్టూర్చింది. నా చెయ్యి ఆమె భుజం మీంచి తీసేసుకోవాల్సిన అవసరం మరి కలగ లేదు

"నీకు చెడుపు, చిల్లంగి వగైరా మంత్ర ప్రయోగాల మీద నమ్మకముందా?" అడిగాను త్రోవలో.

"లేదు యేం?"

"మామయ్య మీద అలాంటి ప్రయోగమేదో జరిగిందని నా అనుమానం."

"ఆయనకు శత్రువు లెవరున్నారు అలా చెయ్యడానికి ?"

మాయ చెప్పిందాంట్లో పాయింట్ ఉంది. "చెప్పింది నిజమే" అన్నాను.

ఆ తరువాత మాకేం మాట్లాడుకోవాలో తోచలేదు. ఆమె స్పర్శను నేనూ, నా సాన్నిహిత్యాన్ని ఆమె మవునంగా ఆనందించడంతో మునిగిపోయాం.

ఇంటికి బాగా చేరువగావచ్చేశామన్న విషయం గూడా మర్చిపోయాం ఆ మైమరపులోబడి.

ఇల్లు, ఇంటి ముందరున్న కారుని చూడగానే. మాయ నేనూ విడిపోయాం.

తోటదాటి యింటికి సమీపించేసరికి. వరండాల్లో పచార్లుచేస్తున్న మామయ్య కనిపించేడు.

మాయను, నన్నూ చూడగానే "ఇంత సేపూ యెక్కడి కెళ్ళార్రా మీరు?" ఆవేశంగా అరిచాడు మామయ్య.

మామయ్య తీరు నన్ను ఆశ్చర్యంలో ముంచింది.

"అంకుల్! అలా సముద్ర పొద్దున కూర్చుని వస్తున్నాం" జవాబిచ్చింది మాయ.

"కూర్చుని వస్తున్నారా? పడుకుని వస్తున్నారా?" మామయ్య మాటల్లో కసి ధ్వనించింది. కొరడా దెబ్బ తిన్నట్టు అదిరిపడ్డాను.

ఇద్దరు యువతీ యువకులు చనువుగా, స్నేహంగా ఉంటే, వారు తమ లైంగికావసరాలు తీర్చుకోవడానికే అలా ఉన్నారని అనుకోవాలా?.

అయినా ఆమె నా మామ కూతురు. వరుసవుతుంది. ఆమెను సెక్సుదృష్ట్యా చూడడానికి నాకు హక్కువుంది. అలాంటప్పుడు, మా స్నేహం మామయ్యతో ఆగ్రహాగ్ని రగిలించడానికి కారణం?.

"పెళ్ళి చేసుకోకుండా అలాంటి నీచపు పనులు చెయ్యాల్సిన అగత్యం నాకులేదు మామయ్యా" అన్నాను మృదువుగా, కాని దృఢంగా.

దాంతో మామయ్య ఆగ్రహావేశాలకు ఆనకట్టబడింది. "వెళ్ళండి! వెళ్ళండి! వంటామె మీకోసం చూస్తోంది

పోయి భోంచెయ్యండి," అన్నాడు మామయ్య; మళ్ళా పచార్లు చెయ్యడం ఆరంభిస్తూ.

మేం మెల్లగా యింట్లోకి ప్రవేశించాం.

# 5

మామయ్య ప్రవర్తన నన్ను ఆశ్చర్య చకితుణ్ని చేసింది. అయితే. ఆ వింత ప్రవర్తనకూ, ఆయన ప్రస్తుత మానసిక పరిస్థితికి క్లూ ఉన్నట్టనిపించింది నాకు.

ఓరోజున మామయ్య యింటలేని సమయంలో ఈ విషయం ప్రస్తావించాను మాయతో.

"నేనంటే మీ మామయ్యకు ప్రత్యేకాభిమానమని మొన్ననే చెప్పాను. బహుశా నేను చెడిపోతానన్న భయం వల్ల ఆయనకు కోపం కలిగి ఉంటుంది," అంది మాయ.

"నా విషయంలో గాకుండా యింకేమగాడి విషయంలో నయితే, నువ్వు చెప్పింది ఒప్పుకుంటాను. తన మంచిని కోరేవాడ్ని, తన మంచికోసం తాపత్రయపడేవాడ్ని అనే నమ్మకముండబట్టేగదా మామయ్య పిలిపించింది. అలాంటి వాడు యిలా ప్రవర్తిస్తున్నాడంటే ఆశ్చర్యంగా వుంది నాకు," అన్నాను.

"అయితే, యింతకూ యేమిటంటావ్?" అంది మాయ కాస్త చిరాగ్గా.

"ఓ మనిషిని ఆవేశపరుస్తే, ఆ మనిషిలో దాగున్న నిజమైన మనిషి బయటకొచ్చేస్తాడు ముసుగు తీసుకుని"

"అంటే" అంది మాయ ఆశ్చర్యంగా నొసలు చిట్లించి.

"యేంలేదు. మామయ్యకు ప్రెరెక్కిస్తే. అతని కాంప్లెక్సుకి కారణమేమిటో మనకు తెలియవచ్చు"

"అయితే. యేం చేద్దామంటావ్ ?"

"నాకో బ్రహ్మాండమైన ఆలోచన తట్టింది. నీ సహకారం కావాలి."

"చెప్పు. మంచిదయితే, తప్పక తోడ్పడతాను."

"మనిద్దరం స్నేహంగా, సన్నిహితంగా ఉండడం మామయ్యకెందుకో సరిపడ్డంలేదు. నిజానికి, మనమధ్య చనువు, స్నేహం యేర్పడి ఉండకపోతే, ప్రోత్సహించవలసిన వ్యక్తి ఆయన. ఈ బలహీనతను ఆసరాగా తీసుకుని అతనిని వేడెక్కించాలనుకుంటున్నాను"

"అయితే, నేనేం చెయ్యాలో చెప్పు వివరంగా"

"నేనంటే యిష్టంగా వున్నట్టు..."

"ఇష్టంలేకపోతే గదా!"

"నేను చెప్పేది పూర్తిగా విన్నాక అప్పుడు చెప్పు... నేనంటేనీకు...నువ్వంటే నాకు వెర్రివ్యామోహం...మనం పెళ్ళిచేసుకోకుండానే, విచ్చలవిడిగా తిరుగుతుంటాం..."

"నువ్వు చెప్పడం బాగానేఉంది గాని, నా భవిష్యత్తు యేమవుతుందో ఆలోచించావా ?"

"ఆలోచించాను...నావల్ల నీకు చెడ్డపేరుగాని వస్తే, పెళ్ళి చేసేసుకుంటాను నిన్ను"

"అంత బాధపెట్టనులే నిన్ను. చెప్పు."

"అతడి కళ్ళముందు మనం విచ్చలవిడిగా తిరుగుతున్నట్టు కన్పడాలి"

"అలాగే. ఓకే" అంటూ తన అంగీకారం తెలియచేసింది మాయ.

అదిమొదలు మా అవతారాలు మారిపోయాయి. పచి శృంగారం కోసం పడిచచ్చే కాముకులంగా మారాం. ౨

ప్రక్కగదిలో ఉన్న మామయ్యకు మా మాటలు విన్పడతాయంటే చాలు, మేం రహస్యంగా సాగించబోయే కామకలాపం గురించి మాట్లాడేవాళ్ళం.

అదే సమయంలో మేం ఉన్న గదిలోకి మామయ్య వస్తే, ఆయన రాక గమనించి, మేం మామూలుగా అవుపించాలని ప్రయత్నిస్తున్నట్టు అవుపించే వాళ్ళం.

రాత్రుళ్ళప్పుడు మామయ్య మా గదుల్లోకి వచ్చేవాడు. ఊర్లోకి వెళ్ళి సాయంకాలం వరకు రానని చెప్పిపోయి, వెళ్ళిన అరగంటలో తిరిగొచ్చేసేవాడు ఒక్కోసారి బీచికి మేం యిద్దరం షికారుకు వెళ్ళితే, అక్కడ రహస్యంగా, యిసుకదిబ్బల మధ్య యేం తంటాలు పడుతున్నామో అని మా వెనకాలేవచ్చి చూసి వెళ్ళిపోయేవాడు.

మాయకూ నాకూ మధ్య రహస్యకామకలాపం సాగుతోందనీ, అయితే అతని కళ్ళబడకుండా మేం తెలివిగా తప్పించుకుంటున్నామన్న ఆలోచన మామయ్య మనస్సులోకి బాగా పాతుకుపోయేలా చేశాను. నా పథకం ప్రకారం ఇహ ఆఖరి డోస్ యివ్వడమే మిగిలిపోయింది.

ఆవాళ సాయంకాలం అయిదున్నర అవుతుండగా, తాను పట్నం వెళుతున్నాననీ, మర్నాటి ఉదయంవరకూ రాననీ నన్నుపిల్చి చెప్పాడు.

కాని, నాకు తెలుసు, ఏదో సాకుచెప్పి, అరగంటలో మామయ్య వెనక్కు వస్తాడు.

ఆవాళ మామయ్య తిరిగొచ్చేసరికి నేనేం చేస్తున్నట్లు కనిపించేదీ మాయకు చెప్పాను. ఆమె తన అంగీకారం వెంటనే తెలియచేసింది.

కావాలనే వీధిగేటు, దిగువనున్న గదుల తలుపులు

తాళాలు వెయ్యకుండా వదిలేశాం.

సరిగ్గా అరగంట గడిచాక, రోడ్డుమీద కనిపించిన హెడ్‌లైట్ల కాంతినిబట్టి, మామయ్య తిరిగి వచ్చేస్తున్నాడని అనుకున్నాము. మా బంగ్లాముందు కారు ఆగడం బట్టి, అది మామయ్యకారని నిర్ధారి చుకుని, క్షణం ఆలస్యం చెయ్యకుండా మేం యిద్దరం మాయ గదికి పరుగెత్తాం.

అంతవరకూ వెలుగుతున్న గదిలోని పెద్దలైట్ తీసేసి నైట్‌లాంప్ మాత్రం ఉంచాం. ఒంటిమీదున్న చొక్కా, పాంటూ లాగేసుకుని, పైజమాలోకి మారాను.

మాయను మచాంనికి అడ్డంగా పడేసి, ఆమకు చేరువగా కూర్చున్నాను సిద్ధంగా.

గదిబయట మామయ్య పాదాలచప్పుడు వినృడగానే, ఆమెమీదకు వంగాను.

మాయ తమాషాగా మూలుగులు వదల ్ంభించి-ది.

అదే సమయంలో మామయ్య గదిలోకి వచ్చాడు మాకు తెలుసు. వస్తూనే పెద్దలైటు స్విచ్ వేసాడు. గదంతా కళ్లు చెదరగొట్టే వెల్తురుతో నిండి ౼ ఉంది.

"ఆఁ... ఎవరది?" అంటూ మేం యిద్దరం విడి పోయాం మరుక్షణంలో మామయ్యను చూస్తూనే "అంకుల్! నువ్వా?.. పట్నంవెళ్ళలేదా?" అని మాయ. "మామయ్యా! నువ్వా?.. రేపటివరకూ రా న్నావ్?" అని నేనూ అన్నాం. అంటూనే సిగ్గుతో, భయంతో లేచి బట్టలు సర్దుకున్నట్లు నటించసాగాం.

"ఊఁ... నన్ను అలా పట్నం పోనిచ్చి, మీరుచేస్తున్న నిర్వాకం ఇదన్నమాట?" అన్నాడు మామయ్య గంభీరంగా.

మేం మాట్లాడలేదు. నేలచూపులుచూస్తూ నిలుచున్నాం.

"మాట్లాడరేం?" ఒక్క గసురు గసిరాడు మామయ్య.

ఒక్క క్షణం కంగారుగా, బేజారుగా మామయ్య మొహంలోకి చూసి మళ్ళా తలలు వంచుకొన్నాం.

"ఎన్నాళ్ళనుంచీ సాగుతోందీ వ్యవహారం?" మాయకు చేరువ పోయి అరిచాడు మామయ్య.

మాయ భయంనటిస్తూ మవునంగా వుండిపోయింది. నాదగ్గరకొచ్చాడు; నా చుబుకం యెత్తి నా కళ్ళల్లోకి చూస్తూ "ఈ సాయంచెయ్యడానికట్రా నువ్వు యిక్కడ కొచ్చిందీ?" అన్నాడు మామయ్య

మామయ్య మెల్లగా మాట్లాడుతున్నా, మా మవునం వల్ల అతని కోపం క్షణక్షణానికి పెరిగిపోతుందని తెలుసుకున్నాను.

"తప్పుచేసాక, పట్టుబడ్డాక యింకా యేం చెప్పమంటావు మామయ్యా?" అన్నాను స్వరం బాగా తగ్గించి, గొణుగుతున్నట్టుగా.

"నోర్ముయ్! చేసింది చాలక యింకా మాట్లాడుతున్నావా?" ఇంటికప్పు విరిగేలా అరిచాడు మామయ్య.

ఆత్మాభిమానం ఉన్న యువకుడిలా పౌరుషం తెచ్చుకుని "మామయ్యా! ఎందుకలా అరుస్తారు? నేను చేసిన తప్పేమిటి?" అన్నాను.

"అబ్బో, అంత తెగించిపోయావ్రా." అంటూ నా జుత్తుపట్టుకుని చెంపలమీద రెండు కొట్టాడు.

నా కళ్ళు పచ్చగా అయిపోయాయి రెండు క్షణాలు.

తేరుకుని, రెట్టించిన కోపంతో "నన్ను కొట్టడానికి నీకేం హక్కుంది?" అన్నాను అరిచినట్టుగా.

నన్ను కొట్టడానికి మామయ్య మళ్ళా చెయ్యెత్తాడు. అదే క్షణంలో మెరపులా మాయ నా వద్దకు పరుగెత్తు కొచ్చింది. "అంకుల్ ఆయనమీద యింకో దెబ్బ వేసా రంటే మీ మర్యాద దక్కదు," అరిచింది గట్టిగా.

మాయను చూస్తూనే మామయ్య కొయ్యబొమ్మలా నిలిచిపోయాడు, మాటలుడిగిపోయినవాడిలా.

రెండు క్షణాలు పోయాక "అంటే, ఇందులో నీ ప్రమేయం కూడా ఉందన్నమాట?" అడిగాడు మామయ్య మాయను గొణిగినట్టుగా.

"ఇందులో ప్రమేయం ప్రశ్నేముంది ?" సీతాపతి అంటే నాకు యిష్టం. నా కోరికలు తీర్చే మగతనం అని నిలో ఉంది. అందుకే అతన్ని నా గదిలోకి ఆహ్వానిం చాను," అంది మాయ.

వింటూనే మామయ్య బాధగా కళ్ళు మూసుకున్నాడు. పిడికిళ్ళు బిగించుకొని మెలితిరిగిపోసాగాడు.

మాయ అనసాగింది.

"డబ్బుకోసం మొగుడు, సెక్సుకోసం ప్రియుడు అనే సిద్ధాంతం అమలుజరిపిన రాజ్యలక్ష్మి కూతుర్ని నేను. నాకు డబ్బుంది మొగుడక్కర్లేదు. నా కోరికలు తీర్చడా నికి ప్రియుడు కావాలి. సీతాపతి నాకు ప్రియుడిగా తగిన వాడు...." అంటూ యింకా యేమేమో అంటుంటే "మాయా! మాయా!" అంటూ గుండెపట్టుకుని నేలమీద పడిపోయాడు మామయ్య.

మేం ఊహించనిది జరిగింది. అతడికి ఉపచారాలు చెయ్యడానికి పరుగెత్తాం యిద్దరం.

ఇక ఆ పథానికి అంతతో స్వస్తిచెప్పాను. ఏమంటే

ఇంకోసారి అలాచేస్తే మామయ్య గుండెఆగి మరణిస్తాడేమో!

# 6

"చూడు అప్పన్నా! నేనూ, మాయ స్నేహంగా ఉంటే మామయ్య ఎందుకంత మండిపోతున్నాడు?" అడిగాను తోటమాలి అప్పన్నను, అతని గుడిసెకు వెళ్ళి.

"అలా కూసోండి బాబూ!" అంటూ గుడిసెబైట ఓ నులకమంచం వేసాడు అప్పన్న. దానిమీద కూచున్నాను.

"నాకూ ఆబ్బురంగానేఉంది బాబూ! ఆ బాబు యిలా రాజ్యలక్ష్మిగారిమీదా మండిపోలేదు" అన్నాడు అప్పన్న, నేను కూచున్నాక, క్షణంగడిచిన తర్వాత.

"ఈ యింటికి ఎన్నాళ్ళబట్టి, తోటమాలిగా వుంటున్నావు?"

"ఈ యిల్లు కట్టినప్పటినుంచీనండి"

"అంటే మొదట్నుంచీనన్న మాట... అయితే దాపరికం లేకుండా చెప్పు. రాజ్యలక్ష్మిగారు, మామయ్యగారు ప్రేమగా వుండేవారా?"

యే యింట్లోనయినా పనివాళ్ళకు తెలియని రహస్యాలుండవు. అందుకే, మామయ్య గత జీవితంగురించి అప్పన్నను అడిగాను.

"ఆ మాట కచ్చితంగా చెప్పలేను బాబూ!... కాని ఒక్కమాట చెప్పగలను కచ్చితంగా.... దెబ్బలాడుకుండేవారు గాదు.... లోలోపల యెలాగుండేవారో గాని" అప్పన్న చెప్పాడు.

"కొత్తతండ్రిని చూసి మాయ యెలా ప్రవర్తించేది?"

"మాయమ్మ యిప్పటిలాగే ఉండేది బాబూ! యెప్పుడూ

చదువూ, ఆటలు, షికార్లు...పిక్నిక్‌లు... కాని మాయమ్మ అంటే మీ మామయ్యగారికి ప్రాణం"

"బహుశా,... తను అంత ప్రాణప్రదంగా చూసుకున్నా ఆమెకు నావల్ల ఎక్కడ ద్రోహం జరుగుతుందో అని.... మామయ్య నామీద మండిపడి ఉంటాడు!" నాకు నేను సమాధానం చెప్పుకున్నట్టుగా అన్నాను.

"అంతే అయ్యుంటాది బాబూ!" తల తాటించాడు అప్పన్న.

"మరి, మామయ్య దేన్నో చూసి ఎందుకలా భయపడిపోతున్నాడంటావ్?" ఇప్పటికి అప్పన్నను అసలు విషయం అడగడానికి అవకాశం దొరికింది.

"తమరు యేమనుకోనంటే ఓమాట చెప్తాను"

"చెప్పు, సందేహించకు" ప్రోత్సహించాను.

"ఇవన్నీ దెయ్యాలు దేవుల్లాడే దిబ్బలు బాబూ!... యే దెయ్యమో, యే కామినీ పిశాచమో, మీ మామయ్య గార్ని పట్టుకొని పీడిస్తోంది బాబూ."

"ఈ మాట మామయ్యతో ఎప్పుడూ చెప్పలేదా?"

"వారు నమ్మరు బాబూ. మునుపోసారి ఈ మాట యింకెవరిగురుంచో అంటే అగ్గిఫైరయిపోయారు నా మీద."

నా మనసులో మాటలు అప్పన్న నోటినుంచి వస్తున్నట్టుగా ఫీలయ్యాను ఆ క్షణంలో. అప్పన్న మాటలు అంతగా నచ్చాయి నాకు.

మామయ్య విచిత్ర ప్రవర్తనకు కారణం, దెయ్యం పట్టడంతప్ప నాకు యింకొకటేదీ సమంజసంగా కనింపిచటంలేదు, యెంత ఆలోచించినా.

ఆ సంగతి నేను చూసుకొంటాను గానీ, యీ చుట్టు పట్ల నీకు తెలిసిన భూతవైద్యుడెవడన్నా ఉన్నాడా?... నేను వెళ్ళి అతన్ని కలుసుకోవాలనుకుంటున్నాను." అన్నాను నేను.

రెండు నిముషాలు దీర్ఘంగా ఆలోచించిన మీదట పట్నంలో భూతవైద్యులు చాలామంది బోర్డులు కట్టుకుని ఉన్నారు గాని, వాళ్ళని నమ్మలేం బాబూ...ఇక్కడికి ఆరుమైళ్ళలో ఓ పల్లెటూరు ఉంది...అక్కడ మాంచి వైద్యుడున్నాడు బాబూ నామట్టుకు నేను ఒకర్ని చూసాను...మంత్రం చదివి వేపమండతోటి దెయ్యంపట్టిన వాడి తలమీద ఒక్కటేసాడంటే, దెయ్యం పుంజాలు తెంపుకుని పరుగెత్తాల్సిందే" చెప్పాడు అప్పన్న.

మామయ్య నిజంగా యేపిశాచం చేతిలోనో చిక్కుకుని ఉండాలి. లేకపోతే పట్ట పగలు తన నీడను చూసి తను భయపడిపోయే పిరికివాడయి పోవడమేమిటి?

మామయ్యకు తప్పక భూతవైద్యం చేయించాలి.

"ఆ భూతవైద్యుని పేరేమిటన్నావ్?"

"భద్రిరాజు"

'వూరు పేరేమిటన్నావ్?"

"మెట్టపాలెం, మహా అయితే రెండు క్రోసులుంటుంది. యిక్కడికి......మీరయితే అలా షైరెళ్ళినట్టు వెళ్ళి వచ్చెయ్యొచ్చు.'

'మామయ్యను చూడగానే భూతవైద్యానికి సంబంధించిన కేసవునో, కాదో చెప్పేస్తాడంటావా?"

"ఆ వైద్యుడికి మొగమాటంలేదండి. టకీమని మొహం మీద చెప్పేస్తాడు....అంతే గాదండి... ఆ

బాబుకి యీ కేసు నయంగాదనిపిస్తే...కానీ పుచ్చుకోడు. ఆ మాట ముందే చెప్పేస్తాడండి."

"అంటే నిక్కచ్చయిన మనిషిన్నమాట" అంటూ అలాంటి వాళ్ళు కొందరింకా యీ కాలంలో ఉన్నందుకు ఆశ్చర్యం కనబరిచాను.

'ఆ బాబు చాలా మంచివాడు బాబూ" ఈ ప్రాంతాల్లో అలాంటి గొప్ప మనిషి లేడు బాబూ."

అప్పటికి ఓ నిశ్చయానికొచ్చాను. మామయ్యను భద్రిరాజుకు చూపించి, బాగు చెయ్యించాలి!

"వస్తాను అప్పన్నా! మామయ్య జబ్బే నయమయితే మామయ్యతో చెప్పి నీకో మంచి బహుమతి యిప్పిస్తాను. అన్నాను మంచం మీంచిలేచి బయలు దేరుతూ.

'బహుమానం యెందుకు బాబూ! వారి ఉప్పతిని బ్రతుకుతున్నాం. ఆ మాత్రం సాయం చెయ్యకపోతే ఎలా బాబూ!" అన్నాడు అప్పన్న నా వెనకాలేవస్తూ.

కొంతదూరం అలాగే నా వెనకాలేవచ్చి 'ఉంటాబాబూ' అని చెప్పి వెనక్కి వెళ్ళి పోయాడు.

# 7

అమర్నాడే భూతవైద్యుడు వద్దకు వెళ్దామనుకున్నాను కాని, మామయ్య యింటివద్దనే ఉండిపోయాడు. అతనితో పాటుగ నేనూ ఉండిపోవాల్సి వచ్చింది.

ముందుగా భూతవైద్యం గురించి మామయ్యతో చెప్పడం నా కిష్టంలేదు.

రెండు తరాల క్రితం యువకుల్లో ఒక రకం భావా లుండేవి. శాస్త్ర పరిశోధనకు అలవికానిది దేన్నీ వాళ్ళు నమ్మేవాడుకాదు. మామయ్యలో ఈ నాటికీ ఆ

భావాలున్నాయి. దెయ్యాల ఉనికి సైన్సు నిరూపించ లేదు కాబట్టి, దెయ్యాలన్నవిలేవు అని వాదిస్తాడు, అప్పటి రోజులాగానే.

వైద్యం అంతా అయ్యాక, తాను బాగుపడ్డాక, దెయ్యాల గురించి నమ్మకేం చేస్తాడు? అప్పుడే చెప్తాను అతనితో. అంతవరకూ భూత వైద్యం విషయం రహస్యంగా వుంచడమే మంచిది.

మర్నాడు కూడా మెట్టపాలెం వెళ్ళే వీలు కలగలేదు.

మూడో రోజున మామయ్య ఏదో వ్యవహారం మీద పట్నంలోకి వెళ్ళగానే మాయను వెంటబెట్టుకుని వెళ్ళాను మెట్టపాలెం.

భద్రిరాజు యిల్లు పట్టుకోవడం పెద్ద కష్టంకాలేదు నాకు. భూతవైద్యం చేసే భద్రిరాజు యిల్లు యెక్కడని రోడ్డుమీద ఆడుకునే ఓ కుర్రాడ్ని అడగ్గానే చూపెట్టాడు.

ఒక వెడల్పాటి డబ్బారేకు మీద భూతవైద్యుడు, భద్రిరాజును సంప్రదించి భూత, ప్రేత, పిశాచ, డాకినీ, గాలి దెయ్యాల్నుంచి రక్షణ పొందండి అని రాసిఉంది.

భద్రిరాజు సన్నగా నల్లగా సుమారు యెత్తుతో ఉంటాడు. యెర్ర రంగు లుంగీ మీద అదే రంగు కల్లీ చొక్కా వేసుకొన్నాడు. మెడలో రుద్రాక్షమాల. ఓ ఆంజనేయుడి బిళ్ళ అదే తాడుకు యేవేవో తాయెత్తులు కట్టబడి ఉన్నాయి.

నున్నగా సాపుగా దువ్విన అతని నల్లని జుత్తు ఒత్తుగా నూనె రాయడం వల్ల నిగ నిగ మెరుస్తోంది. అది అతని భుజాలను ఒరుసుకుంటూనే వేలాడుతోంది.

ఎరుపు జీరలు గల కళ్ళు, చిన్నగా నవ్వినా బయట

పడే తెల్లని పళ్ళూ అతని ముఖానికి వింత ఆకర్షణ తెచ్చి పెట్టాయి.

"యేం కావాలి బాబూ? ఇలా వచ్చారు?' అడిగాడు భద్రిరాజు నా వంక, మాయవంక ఎగాదిగా చూసి

క్లుప్తంగానేనెందుకొచ్చానో చెప్పాను.

'రండి బాబూ!' అంటూ మమ్మల్ని లోనికి తీసు కెళ్ళాడు. అదొక పెద్దగది. దాన్నిండా రక రకాల దేవుళ్ళ విగ్రహాలు, పటాలు ఉన్నాయి. వాటి మీద ఎర్రని కుంకుమ, గంధం, అక్షింతలు, మస్తుగా చల్లబడి ఉన్నాయి. గన్నేరు పువ్వులు తాజావి, వాడి పోయినవి, ముందురోజువి తీయలేదు కాబోలు విగ్రహాల మీద, పొటోలమీద వేలాడుతున్నాయి.

భద్రిరాజు పోయి నలుచదరంగా ఉన్న ఓ తాటాకు చాపమీద కూర్చున్నాడు. తనకెదురుగా ఉన్న పెద్ద తాటాకు చాపమీద కూర్చోమన్నాడు మమ్మల్ని.

ఓ నిముషం దేవుడ్ని ధ్యానించినట్టు కళ్ళుమూసి తెరచి' చూడండి బాబూ!...మొదట్లో నేను భూతవైద్యం చేసే వాడ్ని కాదు...మిఠాయిచేసి బండిమీద త్రిప్పి అమ్మేవాడ్ని...ఓసారి ఓ సాధూగారు వచ్చారు ఈ ఊరు. రచ్చబండ దగ్గర రావి చెట్టుఉంది చూసారూ. సరిగ్గా అక్కడే కూర్చున్నారు....ఎప్పటిలా రోజు ఉదయం లేచి పట్నంలో మిఠాయి అమ్మకు రావాలని బయలు దేరాను......

"బిడ్డా! నీ త్రోవ అదిగాదు. రా చూపిస్తా నీ త్రోవేదో!" అని పిలిచారు సాధుగారు.

సాధూగారి దగ్గరకు వెళ్ళాను ......వారివద్ద ఉప

దేశం పొందాను......వారి భక్తుడనయ్యాను, అని తన కథ అడక్కుండానే చెప్పాడు భద్రిరాజు.

"మా అంకుల్‌కి శత్రువులెవ్వరూ లేరు......అతని మీద ఎవరు ప్రయోగం చేసారంటారు?" అడిగింది మాయ.

చూడమ్మా! మొదట మీ నాన్నగార్ని చూస్తేగాని. అది ప్రయోగమో లేక మామూలుగా యే దయ్యము పట్టడమో చెప్పలేము. అయినప్పటికీ మీ ప్రశ్నకు జవాబు చెప్పగలను .....చాలా మంది యేమనుకుంటా రంటే, యెవరో యెవరిమీదో కక్షగట్టి సాధించ దల్చు కుంటే తప్ప, చెడుపు, చిల్లంగివంటి ప్రయోగాలు జరగ వను కుంటారు. అయితే అది సరికాదు... చేతబడి నేర్చుకొన్నవ్యక్తి యెప్పుడూ యెవరో ఒకరిమీద ప్రయో గిస్తూ ఉండాలి.. ... అలాటప్పుడు చేతబడి చెయ్య డానికి యే విరోధమూ అక్కర్లేదు," చెప్పాడు భద్రి రాజు.

"అయితే మామయ్యగార్ని చూడగానే, ప్రయోగమో, గాలి వాలడమో వెంటనే మీరు చెప్పెయ్యగలరా?" అడి గాను నేను.

తప్పకుండా. భూతవైద్యానికి సంబంధించని కేసు తీసుకుంటే మా పేరు పోతుంది......అంతేగాదు...... మా గురువుగారికి కోపమొస్తుంది...... అయినా మాకు తీరికేదండీ......ఇప్పటికిప్పుడు ఒక బాలగ్రహ, ఒక కామినీపీడ, ఒక చెడుపుకేసు చేతిలో ఉన్నాయి."

"ఈ సందర్భంలో మీకో విషయం చెప్పాలను కుంటున్నాను. మీరేం అనుకోకపోతే" అన్నాను, అతని

మొహంలోకి నిశితంగాచూసి.

"చెప్పండి: సందేహించకండి" హామీ యిచ్చాడు భద్రిరాజు.

"మా మామయ్యకు దెయ్యాలూ, భూతాలూ అంటే నమ్మకంలేదు......ఎవరు చెప్పినా వినేరకం కూడా కాదు... మహా మొండి. ఆయనకు తెలీకుండా... రహస్యంగా జరగాలి భూతవైద్యం... అంతేగాదు... అందువల్ల వైద్యం పూర్తయేంతవరకూ మీ డబ్బు యివ్వడానికి వీలువడదు." ఆఖరుకు నామనస్సులోని మాట చెప్పేసాను అతనితో.

భద్రిరాజు వెంటనే యే జవాబివ్వలేదు. ఆలోచిస్తూ ఉండి పోయాడు చాలా సేపు.

యేమంటారో చెప్పండి... మామయ్యవద్ద చాలా డబ్బుంది. తనకు జబ్బు నయంకావాలిగాని, రెండుమూడు వేలంటే లక్ష్యపెట్టడు... నయమయ్యాక మిమ్మల్ని మర్చిపోతామేమోనన్న బెంగ పెట్టుకోకండి ... నయాపైసలతో మీసొమ్ము మీకందేలా చూసే పూచీ నాది" అన్నాను అతని మవునాన్ని యిహ భరించలేక.

భద్రిరాజు కళ్ళు అర్ధ నిమీలితాలయ్యాయి ఒక్కసారిగా. అలా రెండు సెకన్లు ఉండి కళ్ళుతెరచి "భగవదేచ్ఛ! అలాగే కానివ్వండి. డబ్బుకాదు మనకు ప్రధానం. మీ మామయ్యగారు నయంగావడం ముఖ్యం," అన్నాడు.

నా సంతోషం చెప్పనలవిగాదు. ట్రీట్‌మెంట్ మొదలు పెట్టకముందే తమ ఫీజు వసూలు చేసుకునే డాక్టర్లున్న ఈ రోజుల్లో, నయంఅయ్యాక, డబ్బివ్వండి అని చెప్పే

నాధుడెవడు? కావుండదని గాని, లేచి అమాంతంగా భద్రిరాజు కాళ్ళమీద పడి మొక్కాలనిపించింది.

"మామయ్యగార్ని చూడ్డానికి యెప్పుడొస్తానంటారు?"

"ఇప్పుడు చాలా బిజీగా వున్నానండి. నెల రోజుల వరకూ వీలుగాదేమో!"

"డబ్బు ముందే ఇవ్వలేదని అలా అంటున్నారా?" అన్నాను కాస్త చురుకుగా.

"అబ్బే! అలాగనుకోకండి. అదే నా అభ్యంతరమైతే ముందే చెప్పేసి ఉండేవాడ్ని. నాకు మోమాటాలు లేవు."

"మరయితే వెంటనే వారం రోజులోపున రండి. మామయ్య గార్ని చూడండి. లేకపోతే, మామయ్య పరిస్థితి మరింత విషమించవచ్చు" అన్నాను కాస్త బాధగా.

"అలాగే బాబూ! వస్తాను. నన్ను చూడగానే, ఎందుకొచ్చారు మీరు, ఎవరుమీరు అని, నన్ను మీ మామయ్య గారడిగితే యేంచెప్పాలి?"

"ఈ రంగు బట్టల్లోగాకుండా సాదా బట్టల్లో రండి. నా స్నేహితుడిగా పరిచయం చేస్తాను" అని నేను అనగానే భద్రిరాజు తన అంగీకారం తెల్పాడు.

మెట్టపాలెం వెళ్ళిన పని విజయవంతమైనందుకు, ఆనందంగా తిరుగు ప్రయాణం మొదలు పెట్టాం నేనూ, మాయ.

# 8

ఆ మర్నాటినుంచే భద్రిరాజు రాకకోసం యెదురు చూడసాగాను.

నేను మనసారా దేవుడ్ని కోరిందేమంటే, మామయ్య

యింట్లో ఉండగానే భద్రిరాజు రావాలని.

వారం రోజుల తర్వాత నేనాశించినట్టుగానే, మామయ్య యింట్లో ఉన్నప్పుడే వచ్చాడు భద్రిరాజు.

గత రాత్రి భయంకరమైన పీడకల వచ్చింది మామయ్యకు. భద్రిరాజు వచ్చేసరికి, మామయ్య ఆ కల షాకునుంచి యింకా కోలుకోలేదు.

అంతకుముందు వారం రోజులుగా, మామయ్యకు అతి చేరువగా మంచం వేసుకొని పడుకుంటూ వచ్చాను. ఎందువల్లనో, అతనికి వుపించే భీకర దృశ్యాలు గానీ, పీడకలలు గానీ రావటం మానేశాయి.

దాంతో నా పడక, నాకోసం ప్రత్యేకించబడిన గదిలోకి మార్చడం జరిగింది.

రాత్రి పదకొండు కావస్తుండగా, మామయ్య గది నుంచి పిచ్చి అరుపులు పెద్దగా విన్పడ్డాయి.
పరుగున, నేనూ మాయ, మామయ్య గదికి పరుగెత్తాం.

మామయ్య తన మంచంమీద చెమట ఉప్పెనలో తడిసి ముద్దయిపోయి ఉన్నాడు. ఉధృతంగా మలేరియా జ్వరం వచ్చినట్టు, అదే పనిగా వణికి పోతున్నాడు.

తన భ్రాంతి లోకంనుంచి మామయ్యను విడిపించ డానికి మాకు అరగంటకు పైగా పట్టింది. విడుపు లేకుండా నేనొక వైపు, మాయ ఒకవైపు కూచుని పదే పదే అడిగిన మీదట, తనకొచ్చిన కలేమిటో చెప్పాడు మామయ్య.

మామయ్య హాలులో నిలుచున్నాడట. ఆ క్షణంలో ఎవరూ యింట్లోలేరట. ఎవరో స్త్రీమూర్తి తెల్లని బట్టల్లో

వీధి ద్వారంవద్ద అవుపించి "లోనికి రావచ్చాండీ?" అని అడిగింది. ఆవిడ్ని చూస్తూనే మామయ్య గుండెలు భేరీల్లా మ్రోగడం ఆరంభించాయి. రాత్రి పగలూ మామయ్యకు శాంతిలేకుండా చేస్తున్నదావిడే!

"వద్దు! రావద్దు! దయచేసి రావద్దు" అని మామయ్య యెంత మొత్తుకున్నా ఆమె పట్టించుకోలేదు. "నేను రాకపోతే యెలాగండీ?" అని నవ్వుతూ లోనికి వచ్చింది. ఆమె నవ్వుతున్నప్పటికీ, ఆమెతీరు అతని కెందుకో భయం కలిగించింది. దూరంగా వెళ్ళిపోసాగాడు.

"ఎందుకండీ నేనంటే అంత భయం?" అంటూ ఆమె అనునయంగా మాట్లాడుతూ, అతనికి చేరువగా వెళ్ళేసరికి, అతని భయం తగ్గినట్టనిపించింది. మామయ్య దూరంగా వెళ్ళిపోలేదు.

ఆమె అతనికి చేరువగా వచ్చి అతని కళ్ళల్లోకి చూసింది.

ఆ క్షణంవరకూ నవ్వుతున్న ఆమె కళ్ళల్లో ఒక్కసారిగా కోపావేశం! భయంతో ఒక్కడుగు వెనక్కి వేశాడు.

అదే సమయంలో ఆవిడచేతిలో తళతళమని తెల్లగా మెరుస్తూ అర్ధచంద్రాకృతిలో ఉన్న కత్తి అవుపించింది. పిల్లిని చూసిన ఎలకలా మామయ్య పిక్కబలం చూపించాడు. మేడమీదకు పరుగుదీశాడు.

అన్నిమెట్లూయెక్కి అతడు మేడమీదకు చేరుకున్నాడో లేదో అమె అప్పటికే వేటకోసం యెదురుచూస్తున్న బోయవాడులా అతని ఎదురుగా నిలుచుంది.

దడదడ లాడిపోతున్న గుండెలతో తిరిగి దిగువకు

పరుగెత్తబోయాడు. అయితే, యీసారి ఆమెనుంచి, ఆమె చేతిలోని కత్తినుంచి తప్పించుకోలేకపోయాడు.

ఒక్క దెబ్బతో మామయ్య తలతెగి, మెట్లమీదనుంచి బంతిలా కిందికి దొర్లింది.

అంతే! మామయ్యకు భయంతో మెలకువ వచ్చేసింది.

తెల్లవార్లూ మామయ్య నన్ను అంటిపెట్టుకునే ఉన్నాడు. తెల్లవారేక కూడా నేను కాసేపయినా, అతనికి దూరంగా వుండడం సహించలేకపోయాడు.

ఉదయం తొమ్మిదిన్నర అవస్తుండగా వచ్చాడు భద్రిరాజు. కాకీపాంటు, పైన జీరంల బుష్‌షర్టు వేసుకొన్నాడు. నుదుటమాత్రం కుంకుమబొట్టు పెట్టుకోవడం మానలేదు.

ఎవరివో బట్టలు ఎరువుతెచ్చుకుని వేసుకొన్నట్టుగా ఉందిగాని సహజంగా అమరలేదు.

ఈ విచిత్రమైన వ్యక్తి తన స్నేహితుడని చెబితే మామయ్య యేమంటాడో అన్న భయం మనస్సులో ఓ మూల బాధిస్తున్నా, లక్ష్యపెట్టక, "రండి! రండి! ఎన్నాళ్ళయింది మనం కలుసుకుని? ఇన్నాళ్లకా రావడం" అంటూ భద్రిరాజును ఆహ్వానించాను.

తమాషాగా నవ్వి "బోలెడు పనులండీ? వీలుకాలేదు" అంటూ జవాబిచ్చాడు భద్రిరాజు.

మామయ్య హాలులోనే కూచున్నాడు. మాయ యింకా మేడదిగి రాలేదు.

ఆశ్చర్యం నిండిన కళ్ళతో మామయ్య భద్రిరాజు వైపు నిశితంగా చూడ్డం గమనించాను. అయినా పట్టించుకోలేదు నేను.

"మామయ్యా! వీరు భద్రిరాజుగారని గొప్ప నటులు.

ఏదో పౌరాణిక నాటకంలో వేషం వెయ్యడంకోసం గిర జాలు పెంచుకొన్నారు" అన్నాను భద్రిరాజును చూపించి.

కాని, మామయ్య మొహంలో నా మాటలమీద నమ్మకం ప్రస్ఫుటం కాలేదు.

"గజపతిగారనీ వీరు మా మామయ్య. వ్యాపారం చేస్తున్నారు" అని మామయ్యను పరిచయం చేసాను భద్రిరాజుకు.

ఇద్దరూ పరస్పరం నమస్కరించుకొన్నారు, మొహాల మీద ఇబ్బందిగా చిరునవ్వులు అంటించుకుని.

ఆ తరువాత మామయ్యను దీక్షగా పరిశీలించడంలో పడిపోయాడు భద్రిరాజు.

తనవైపు కోరచూపులు చూస్తున్న భద్రిరాజును చూస్తూ అయిష్టంగా మొహం పెట్టాడు మామయ్య.

పరిచయం చేసిన పుణ్యానికైనా వారు ఒక్కక్షణం మాట్లాడుకోలేదు.

అయిదునిముషాలు బరువుగా గడచాక "వస్తానండీ! నమస్కారం! మళ్ళా కలుద్దాం," అంటూ వెళ్ళిపోవ డానికి లేచాడు భద్రిరాజు.

"ఆయన్ని పంపించేసి వస్తాను మామయ్యా!" అని మామయ్యతో చెప్పి, భద్రిరాజును అనుసరించాను.

మామయ్యగురించి ఆయనేమంటాడో అని ఆసక్తిగా ఉన్నాను. చాలాదూరం పోయాకగాని భద్రిరాజు నోరు విప్పలేదు.

"చాలా కష్టమైన కేసు ఇది. నావల్ల కాదేమోనని అనిపిస్తోంది" అన్నాడు భద్రిరాజు గట్టిగా నిట్టూర్చి.

నేనేం మాట్లాడలేదు. క్షణం పోయాక భద్రిరాజే

మాట్లాడాడు.

"మీ మామయ్యగార్ని పీడిస్తున్నది సామాన్యమైనది కాదు. శాకినీ. దాన్ని వదిలించడం నా శక్తికి మించిన దేమో అని అనుకుంటున్నాను"

నిరాశతో నిండిపోయింది నా మనస్సు ఒక్కసారిగా. భద్రిరాజు తనకు చేతకాదంటే, మామయ్యకు నయమయ్యే దెట్లా?

"మీకు వీలుకాకపోతే, మామయ్యకు నయం చెయ్యగలిగే భూతవైద్యుడెవరో మీరే చెప్పండి. ఆయన వద్దకు వెళ్తాను" అన్నాను రెండుక్షణాలు ఆలోచించి.

"చూడండి సీతాపతీ! శాకినీ పడితే వదిలించే మొనగాడు యీ ఆంధ్రదేశంలోనే లేడు. కేరళ రాష్ట్రంలో యిద్దరు, ముగ్గురు ఉన్నారు. అందులో ఒకాయనదగ్గర శిష్యరికం చేసాను కాబట్టి ఆ సంగతి కొంత తెలుసు" అన్నాడు భద్రిరాజు శూన్యంలోకి చూస్తూ, విచారంగా మొహంపెట్టి.

"మరి, మీ గురువుగారు శాకినీని లొంగదీసుకునే విద్య చెప్పలేదా?"

"చెప్పకపోవడమేం? చెప్పారు. ఈనాటి వరకూ ఆ విద్య ఉపయోగానికి రాలేదు. అదంతా తిరిగి గుర్తు తెచ్చుకుని ప్రయత్నిస్తే, ప్రయోజన ముంటుందా అని ఆలోచిస్తున్నాను?"

అమ్మయ్య! నా నిరాశ ఎగిరిపోయింది ఒక్కదెబ్బతో. భద్రిరాజుకు శాకినీని వదిలించే విద్యవచ్చు. ఎటోచ్చీ, యీనాటి వరకూ దాన్ని వినియోగించక పోవడంవల్ల. ప్రయోజనం వుంటుందా, లేదా అని సంశయిస్తున్నాడు

భద్రిరాజు.

"మరి, ఆలోచించకండి రాజుగారూ! ఎలాగైనా వైద్యం ఆరంభించండి" అన్నాను హుషారుగా.

"నాకూ ఆరంభించాలనే ఉంది బాబూ! ...కాని... కాని" ఆగిపోయాడు సంశయాత్మకంగా భద్రిరాజు.

"సంశయం దేనికి? చెప్పండి" అన్నాను అతన్ని తొందరచేస్తూ.

"చాలా అరుదైనవస్తువులు సంపాయించాలి. ఒరిస్సా నుండి నాకు తెలిసిన కొండవాడి దగ్గరనుంచి తెప్పించాలి. ఇంగాక, మా గురువుగారు చెప్పిన మంత్రం యీనాడు ఫలించాలంటే రోజుకు వెయ్యిన్నొకసారి చొప్పున నెల నెలరోజులపాటు పఠనం చెయ్యాలి" ఆగాడు భద్రిరాజు.

"తెప్పించండి. సందేహం దేనికి?...కష్టమని చెప్పి ఆలోచించకండి...మీ కష్టం వుంచుకోను" అన్నాను.

"బాబూ! నాకివ్వాల్సినదాన్ని గురించి మాట్లాడ్డం లేదు నేను. నా కివ్వాల్సింది మీరు యెప్పుడిచ్చినా ఫరవా లేదు. ఇవ్వకపోయినా, రాజరాజేశ్వరీదేవి దయవల్ల నేను బ్రతగ్గలను. నాకున్న బాధల్లా ఆ కొండవాడికి డబ్బిచ్చి ఒరిస్సానుంచి సామాన్లు యెలాతేవడమా అని?"

"అంటే?" అడిగాను. భద్రిరాజు చెప్తున్నది అర్థం ఆయీకానట్టుగా ఉంది.

"నాకిప్పుడు కనీసం వెయ్యిరూపాయిలయినా కావాలి" చివరకు చెప్పేసాడు.

"అంత డబ్బు నాదగ్గ రెక్కడిది?...తరువాత యిస్తా నంటే ఆ కొండవాడు మీ స్నేహితుడు గదా. ఒప్పుకో డంటారా?"

"మీరు చాలా అమాయకుల్లా ఉన్నారు బాబూ! నేను యెప్పుడూ సరుకు వాడి దగ్గర్నుంచి తీసుకుంటున్న మాట వాస్తవమే. అయితే వాడు ఒరిస్సావాడు. కొందవాడు. మనం తెలుగువాళ్ళం. యెటువంటి పరిస్థితుల్లోనూ నమ్మడు."

ఎటువంటి క్లిష్టపరిస్థితి యేర్పడిందో నాకు అర్థమైంది. నావద్ద డబ్బులేదు. మామయ్యనడిగితే యివ్వడు. కాని మామయ్యకు వైద్యం జరగాలి డబ్బులేకపోతే, వైద్యానికి కావాల్సిన వస్తువులు రావు. యేంచెయ్యాలి? నాకేం పాలుపోవడం లేదు.

"ఒక వారం రోజులు గడువివ్వండి. యెలాగో సర్దుతాను" చెప్పాను.

"అలాగేకానీ బాబూ! అయితే అంతకన్నా ఆలస్యం చెయ్యడం తగదు. ఇప్పటికే ఆలస్యం అయిపోయింది. ఆ తరువాత మళయాళ మాంత్రికులు కూడా మీ మామయ్యను బాగుచెయ్యలేరు. మీ శ్రేయోభిలాషిగా యింతకన్నా నేను యింకేమీ చెప్పలేను... వస్తా," అంటూ చక చకా తన వూరువైపు సాగిపోయాడు భద్రిరాజు.

వెళ్తున్న అతనివైపు అలాగే రెండు నిముషాలు చూసి వెనక్కి మరలాను. ప్రత్యక్షమైన దేవుడు వరాలివ్వకుండానే వెళ్ళిపోతున్నట్టని పించింది భద్రిరాజు వెళ్ళిపోతుంటే.

# 9

ఆ రోజు సాయంకాలమే, బీచికి షికారుకెళ్ళినపుడు అడిగాను మాయను. "వెయ్యి రూపాయలు కావాలంటున్నాడు భద్రిరాజు. యేంచేద్దామంటావ్?" అని.

